ISBN 81-237-1315-0

1996 *(శక 1917)*


Etoa Munda Won The Battle *(Telugu)*

**రూ: 7.50**

డైరెక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ - 110 016 చే ప్రచురించబడినది.



నెహ్రూ బాల పుస్తకాలయం

# ఎతోవా పోరాటం గెలిచాడు

## (ఆదివాసి బాలుని కథ)

రచన

**మహాశ్వేతాదేవి**

అనువాదం

**రాధాకృష్ణమూర్తి చల్లా**

ఫోటోలు

**రవికాంత్ ద్వివేది**




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# 1

ఆ ఊరి పేరు 'హాథీపుర్' - అంటే "ఏనుగుల ఇల్లు' అని. అయితే ఈనాడు అక్కడ ఏనుగులేమీ కనుపించవు. మోతీబాబు పూర్వీకులు పెద్ద భూస్వాములు. వాళ్లు పెద్దపెద్ద రాతి సాలలు కట్టించి వాటిలో ఏనుగులను ఉంచేవారు. ఈనాటికీ పూర్వపు పెద్ద ఏనుగులసాల ఒకటి అక్కడ నిలిచి ఉంది. ఎటొచ్చీ అందులోని ముప్పై గదుల్లోనూ ఏనుగుల బదులు వరి, గోధుమ మొదలైన ధాన్యాలు నిలవచేయటం జరుగుతోంది.

ఆ ఊరి పేరు ఒకప్పుడు 'సాల్‌గేర్యా' అని, అది ఆదిమజాతి వారికి చెందినదని, ఎతోవా తాతగారు అంటాడు. నిజానికి 'సాల' వృక్షాల వరుసలు ఆ ఊరి చుట్టూ కాపలా వాళ్లలా నిలిచి ఉండేవంటాడు ఆయన.

"అయితే ఆ ఊరిపేరు ఎందుకు మార్చారు?" "జమీందారీబాబులు ప్రవేశించి మన ఆదివాసుల ఆస్తులన్నీ స్వాధీనం చేసుకున్నారు కాబట్టి".

"మన వాళ్లేమీ అడ్డుపెట్టలేదా?"

"నువ్వు అతి ప్రసంగం చేస్తున్నావు, ఎతోవా! మీ నాన్న ఇలాంటి ప్రశ్నలు వేసేందుకు సాహసించేవాడు కాదు. మనవాళ్లకు చదువుసంధ్యలు లేకపోబట్టి, మనకు ప్రభుత్వంవారికోర్టు వ్యవహారాలేమీ తెలియకపోవడంవల్ల, మనం నష్టపోయాం- అంతే".

"పోనీలే, ఇంకొక్క మాట అడుగుతాను, చెప్పుతారా! ఇక్కడికి వచ్చేందుకు నీ ఆస్తిపాస్తులన్నీ ఎప్పుడు విడిచిపెట్టావు?"

"ఓ వెయ్యి పున్నమిలూ, అమావాస్యలూ గడిచిపోయాయి. ఏం? ఎందుకు నవ్వుతున్నావు?".

"ఏమీ లేదు. ఈ రోజుల్లో ఎవళ్లూ 'పున్నమిలూ, అమావాస్యలూ' అంటూ సంవత్సరాలు లెక్కపెట్టరు".

"అల్లాగా! మా వాళ్లందరూ అల్లా చేసేవారు. నేను బ్రతికిఉన్నన్నాళ్లూ నాకా అలవాటు పోదు, నేను మానను ..... సిద్దూ, కన్హూ అన్నవీరులు సంతాల్ కొండ జాతుల వాళ్ల సేనలను ఇంగ్లీషు వాళ్ల మీద యుద్ధం చేసేందుకు ముందుకు నడిపించిన

కాలంలో మన పూర్వులు వాళ్ల భూములన్నీ వదలివచ్చారు. అదొక ఘోరయుద్ధం. ఇంగ్లీషు వాళ్ల చేతుల్లో ఓడిపోయాక మన వాళ్లందరూ వాళ్లబారినుంచి తప్పించుకునేందుకు దేశమంతా ఇటూ అటూ చిందరవందరయి పోయారు. వాళ్లల్లో కొందరు ఇక్కడకు వచ్చి ఈ అడవిలో నివసించేందుకు వీలయేలాగ బాగుజేసి, ఇక్కడ స్థిరపడ్డారు. ఇదంతా జరిగి చాలాకాలం అయిందిలే".

"ఆహా! మన 'ముందా' జాతి వాళ్లందరూ ఆ విధంగా ఇక్కడ చేరుకున్నారన్నమాట."

'మంగళ్' అనే పేరు గల ఆ ముసలివాడు తీక్షణంగా చూశాడు పిల్లవాడివైపు - పాపం పసిపిల్లవాడు, వాడికేమీ లోకం పోకడలు తెలియవు. కొండజాతి వాళ్లెవరైనా బలాత్కారంగా కాక వాళ్లంతట వాళ్లు తమ భూముల్నీ, పుట్టిన ఊళ్లనూ విడిచి పెట్టి పారిపోతారా! అలా మనస్సులో అనుకుని తాత మళ్లీ ఇలా అన్నాడు.

"కొన్నేళ్లుపోయాక 'బిర్సాముందా' అన్న మన పూర్వీకుడు ఒకడు ఇంగ్లీషువాళ్లపై యుద్ధం చేసేందుకు మళ్లీ మన 'ముందా' వాళ్లను ప్రోగుచేశాడు. మనవి బాణాలు, వాళ్లవి' గుళ్లు. ఆ సమాన ఉజ్జీకాని పోరాటంలో మనవాళ్లు ఓడక తప్పలేదు. గాలి దుమారంలో ఇలా అలా ఎగిరిపోయే ఆకులలా మన వాళ్లు పారిపోయి ఒరిస్సా, బీహారు,



బెంగాలు, అస్సాము రా ష్ట్రాలలో అడవి ప్రాంతాలలో తమ నివాసాలు ఏర్పరచుకున్నారు. ఇప్పుడు ముందాలూ, సంతాలులూ ఎక్కడబడితే అక్కడ ఈ రాష్ట్రాలలో కనుపిస్తారు."

"సరే, నువ్వూ అల్లాగే ఇక్కడకు చేరుకున్నావన్నమాట."

"ఊ! ఛోటా నాగపూరు విడిచి, నడవడం మొదలుపెట్టాము. సువర్ణరేఖానది దాటి అవతలి ఒడ్డు చేరేసరికి మమ్మల్ని చూసి సంతాలు చాలా సంతోషించారు. బాగుందనుకున్నాం - ఎంతమంది ఎక్కువ ఆదివాసులు కూడితే మనకు మరింత బలం అని తోచింది. 'దులాంగ్' నది నీకు తెలుసు కదా! మేము దాన్ని 'దరన్‌గర్హా' అని అనేవాళ్లం. అప్పుడు అదంతా దట్టమైన అడవిగా ఉండేది. మాతో పాటు క్రూరమృగాలు కూడా అక్కడ తిరుగుతూండేవి. ఇప్పుడు నువ్వు మన ఊళ్లో చూసే 'లోధా' ఆదివాసులందరూ 'అడవిజాతి వారే. వాళ్ల పశువులను పులిల బారినుంచి తప్పించేందుకు 'బాఘుట్' అనే దేవుణ్ణి తమ రక్షణ కోసం 'బరమ్' దేవతను పూజిస్తూ ఉంటారు. మేము నివాసయోగ్యంగా ఉండేందుకు అడవులను కొంత ఖాళీ చేసినా మొత్తానికి వాటిని నాశనం చేయలేదు - ఎందుకంటే అడవే మన తల్లి. ఈనాటికీ 'లోధా' వాళ్లు అడవుల్లో వేటాడి తమ ఆహారాన్ని సంపాదించుకుంటారు."

"కాని ఇప్పుడు ఈ 'బాబూ' మన ఆదివాసులే అడవల్ని పాడుచేశారంటారేమిటి?"

"ఆ మాట నిజం కాదు, నాయనా! ఇప్పుడు అడవుల పరిమాణం చాలా తక్కువగా ఉందన్నమాట నిజమే కాని, ఆ ఉన్నంత మట్టుకు ఆ అడవే మనకు తినేందుకు ఆకులూ, అలములు, పశువులూ, పక్షులూ అందిస్తోంది... ఆ 'సాల్' అనే అడవి చెట్టే మన గ్రామదేవత 'గరమ్' అన్నది. అందుచేత మనం పూజించే, ప్రేమించే అడవిని మనం ఎందుకు నాశనం చేస్తాం?

"అయితే ఇప్పుడు 'హాథీఘర్' అని ఈ కొత్త పేరు ఎలా వచ్చింది మన ఊరికి?"

"మనం అడవిని కొంత ఖాళీ చేశాక, నేల అంతా చిరునవ్వు నవ్వినట్లు పంటలు పండేవి. అది చూసి ఈ పెద్దకామందులు ఇక్కడకు చేరుకున్నారు. ఇదంతా లోకం తీరే. చదువులేని వాళ్లని మనల్ని లొంగదీసి, వాళ్లు పెత్తనం చలాయిస్తున్నారు. వాళ్లే మన ఊరిపేరు మార్చారు. సరేకాని, నీకే కుతూహలం అసలు ఎలా కలిగింది?"

తాతకు ఎలోవా ఎలా నచ్చజెప్పగలడు? రోజూ తన యజమాని 'బాబు' ఇంటికి వెళుతూ త్రోవలో ఉన్న పిల్లల బడి గుడిసెలో "సంతాలు" బడిపంతులు పిల్లలకు చెపుతున్న వింత వింత కథలు చాటుగుండా నిలబడి వింటూ ఉంటాడు. "వాళ్ల

బాణాలు ఆకాశంలోకి ఎగురుతూంటే, ఆ ఆకాశం అంతా మేఘాలు కమ్ముకున్నట్లు నల్లగా కనబడేది. ఆ ఘోరయుద్ధాన్ని ఎలా వర్ణించాలో తెలియడం లేదు" అంటూ ఆ ఉపాధ్యాయుడు తన కథలు మొదలు పెట్టేవాడు.

కాని ఆ పంతులు వర్ణించే ఆ యుద్ధం ఫలానా ఏదంటే ఎతోవా చెప్పలేదు. అదేమైనా రామాయణ, భారతాలలోని యుద్ధమా? ఏమో! అలా అతనికి ఆలోచన ఎందుకు కలిగిందంటే రోహిణీపురంలో జరిగే జాత్రలూ, వీధినాటకాలూ చాలా చూడడం మూలాన రామాయణం గురించి, భారతం గురించి అతనికి అంతా తెలుసు.

ఎతోవా కెప్పుడూ ఆ మాస్టరుగారి మాటలే చెవిలో మ్రోగుతూ ఉంటాయి. అతను పనిచేస్తున్నది ఆ గ్రామానికి అధిష్ఠాన దేవతలా ప్రవర్తించే మోతీబాబు క్రింద. అతని పని ఆవులనూ, మేకలనూ పొలాలలో మేపడం.

*　　　　*　　　　*

వాస్తవానికి హాథీఘర్ కలకత్తా నగరానికి చాలాదూరం. హౌరా రైల్వే స్టేషను నుంచి ఖరగ్‌పూర్ వెళ్లి, అక్కడ బస్సు ఎక్కి గుప్తామణి దేవాలయం ముందు దిగాలి. ఆ మందిరంలో 'బరామ్' అమ్మ ఆరాధించబడుతుంది. అక్కడ పూజారి ఒక 'లోధా' ఆదివాసి.

బొంబాయి రాజమార్గం గుండా వెళ్లే లారీలూ, బస్సులూ ఆ గుడి దగ్గర ఆగుతాయి. అందులో జనం ఆ తల్లిని పూజించకుండా ముందుకు సాగరు. గుప్తామణి నుంచి రోహిణీపురానికి వెళ్లే బస్సులు సరిగ్గా సమయానికి లభించవు. కాని నైరుతి దిక్కువైపు ఏడు, ఎనిమిది మైళ్లు కాలి నడకన వెళితే ఒక చిన్న నది వస్తుంది. అది దాటి





ముందుకు సాగితే ఒక ఆదివాసి గ్రామాల గుంపు తగులుతుంది. అక్కడ రోహిణీపురం గుండా దక్షిణదిశ వైపు, డులాంగు నది ప్రక్కనుంచి పోవాలి.

చిన్నచిన్న అలలతో నాట్యం ఆడుతున్నట్లు ప్రవహిస్తున్న ఆ నది యొక్క ఒడ్డుపై పయనిస్తూ ఉంటే, ఆకాశాన్ని అందుకుంటుందా అన్న ఒక 'సాల్' చెట్టు తారసిల్లుతుంది. దాని ప్రక్కనే ఒక 'అర్జున' వృక్షం కూడా ఉంది. అంటే ఇంక అక్కడ హాథీఘర్ చేరుకున్నారన్నమాట.

ఆ చెట్లక్రింద ఒక పెద్ద ఏనుగుది, ఒక పెద్ద గుర్రానిది, 'టెర్రాకోటా' శిలావిగ్రహాలు కనుపిస్తాయి. ఆ విగ్రహాల చిన్నచిన్న నమూనాలు చెట్లవేళ్ల చూట్టూ కూడా కనుపిస్తాయి. ఆదివాసులూ, తదితరులూ కూడా ఆ గ్రామస్థులందరూ ఆ గ్రామ దేవతైన 'గరమ్' అమ్మవారిని పూజించేందుకు అక్కడికి వెళతారు.

అక్కడనుంచి కొంతదూరం పోయాక డులాంగు నది సువర్ణరేఖా నదితో సంగమిస్తుంది. ఆ నదీద్వయ సంగమం ఒక కాషాయ వర్ణ సముద్రంలా గోచరిస్తుంది. ఇక్కడ కావాలంటే స్నానం ఏ ప్రమాదం లేకుండా చేయవచ్చు. ప్రవాహ ఒత్తిడి చాలా వేగంగా స్ఫురించినప్పటికీ నీటిలోతు నాలుగు అడుగుల కంటె ఉండదు. ఎతోవా తరుచు తనకి ప్రియమైన గేదెపై స్వారీ చేస్తూ ఆ నదీ సంగమాన్ని దాటుతూంటాడు.

ఎతోవా పనేమిటో ఇదివరకే చెప్పడం జరిగింది. ఇక అతనికి ఆ పేరు ఎలా వచ్చిందో మట్టుకు చెప్పాలి. ఎతోవా అంటే ఆదివారం నాడు అతను పుట్టాడు కాబట్టి

ఆ పేరు పెట్టబడింది. ఒకవేళ అతను సోమవారం నాడు పుట్టి ఉన్నట్లయితే అతణ్ని 'సోమ్రా' అనో లేక 'సోమై' అనో లేక అటువంటి మరో పేరుతోనో పిలిచేవారు. అంటే ఆదివాసులు తమ పిల్లలకు వాళ్లు పుట్టిన రోజుననుసరించి పేర్లు పెడతారని తెలుసు కోవాలి. ఈ పద్ధతిని బెంగాలీ నామధేయాల్ని అనుకరించేవారు ముఖ్యంగా అవలంబిస్తారు. ఎతోవాకి ఆ నామకరణం చేసినది అతడి తాత మంగళ్‌ముందా. ఈ రాష్ట్రంలో ముందాలు, లోధాలు, సంతాలులు బెంగాలీభాష ఎరుగుదురు. తమతమ మాతృభాష మాట్లాడగలరు.

ఎతోవా ఎప్పుడూ ముందు పరుగుతీయడానికి ఉత్సాహంతో దుముకబోతున్న గుర్రంపిల్లలా ఉంటాడు. అతని వయస్సు పది సంవత్సరాలు మాత్రమే. అతని జుట్టు కొంచెం ఎరుపూ, కొంచెం ఊదా కలిసిన రంగుది. అతని కళ్లెప్పుడూ చురుగ్గా తళతళలాడుతూ ఉంటాయి. అతను ధరించే దంతా ఒక ఖాకీ నిక్కరుమట్టుకే. ఇంత చిన్నతనంలోనే, ముసలివాడైన తాతకు సహాయం చేయవలసి ఉండడం మూలాన జీవితం యొక్క ఎగుడు దిగుడు అనుభవాల పాఠాలు అతను నేర్చుకోవలసి వచ్చింది.

అతని కంటికి కనుపించే ప్రతి ఎండిన పుల్లా, కొమ్మా, ఆకూ సేకరించి ఇంటికి వంట చెరకు నిమిత్తం చేరవేస్తూంటాడు.

వాళ్ల ఊళ్లో ప్రతి వారం ఒక రోజు సంత జరుగుతుంది. అక్కడి అంగడివాళ్ల ప్రాంగణాలు శుభ్రపరిచి వాళ్ల దగ్గరనుంచి అతను ఒక గోను సంచి సంపాదించాడు. తను ఎక్కడికి వెళ్లినా దాన్ని కూడా తీసుకువెళతాడు. అతను దూళ్లను కాపలా కాస్తున్నపుడు చెట్లక్రింద పడిన సరుకును వంటచెరకు కోసం సేకరించి ఆ సంచిలోకి చేరుస్తాడు. చెరువు ఒడ్డున ముల్లంగిలు లేక ఆకుకూరలు ఏమైనా లభిస్తే అవి త్రవ్వి, పీకి తన సంచిలో పడవేసుకుంటాడు.

ఆ తర్వాత దులాంగు నది దాటి అవతలి ఒడ్డున ఉన్న పచ్చిక బీళ్లలోకి ప్రవేశిస్తాడు. ఒక కన్ను తను మేపే దూడలపై వేసి ఉంచుతూనే, సువర్ణరేఖా నదీ తీరానికి చేరుకుని





ఆ నదిలో తన వలను విసిరి చేపలు పడుతుంటాడు. అటువంటి సమయాలలో తన ముట్టుకు తానేదో మహారాజునయినంత – నదికి, ఆకాశానికి, పచ్చికబీడులకూ చక్రవర్తినయినట్లు – ఆనందాన్ని అనుభవిస్తాడు. తనలో తను ఇలా అనుకుంటాడు, "నా రోజు బాగుంటే ఇవేళ హాయిగా చేపలకూర తింటాము నేనూ, మా తాతా. లేకపోయినా ఫరవాలేదు. ఈ ఆకుకూరలతో ఎప్పుడూ లోటులేకుండా పొట్ట నింపుకోవచ్చు. నాకు దొరికిన దుంపకూరలను చిల్లర కొట్టు మామయ్యకు ఇచ్చి అతని దగ్గర నుంచి మాకు కావలసిన నూనె, పప్పులూ, ఉప్పులూ తెచ్చుకుంటాను. ఈ ఇచ్చిపుచ్చుకోవడం బేరం కుదరకపోతే, నేనూ, తాతా ఆ దుంపలనే తిని తృప్తి పడతాం" అని.

ఇలా తను తినబోయే దాన్ని గురించి ఆలోచిస్తూంటే ఎతోవాకు అసలు ఆకలిమాటే గుర్తుకురాదు. తన అమాయకపు ఆనందంతో నాట్యమాడుతూ నదీజలాలనూ, చుట్టూ ఉన్న భుజపత్రాల తూడులనూ, అడవిపూలనూ, విశాల ఆకాశాన్ని ఇలా సంబోధిస్తాడు "మా పోరాటం గురించి మీకు తెలుసా? ఎంత భీషణకరమైనదో అది! బాణాలు ఆకాశంలోకి ఎగిరేవి ; తుపాకీ గుళ్లు పేలేవి ; అన్ని దిక్కుల్లోనూ గుర్రపు డెక్కల చప్పుడు ప్రతిధ్వనించేది. ఓహ్! అది ఒక ఘోర, భీకర సంగ్రామం!"

నిజం చెప్పాలంటే అసలు ఏ పోరాటమో స్కూలు మాస్టరు చెప్పినది ఎతోవాకి తెలియదు. అది 1857 నాటి ప్రథమ భారత స్వతంత్ర యుద్ధమా? లేక బాణాలకూ తుపాకీగుళ్లకూ మధ్య సంఘర్షణ జరిగిన మరేదైనా సమరమా? ఒక్కొక్క రోజు ఒక్కొక్క యుద్ధం గురించి బడిపంతులు మాట్లాడేవాడు. అదంతా నిక్కచ్చిగా ఎతోవాకి తెలియదు, తెలుసుకోవాలన్న ఛాదస్తమూ లేదు అతనికి. అది ఒక సంగ్రామం అయితే



చాలు, దాని వివరాలేమీ అతనికి అక్కరలేదు. ఆకాశానికి, జుమ్మని గడ్డిమొక్కల చుట్టూ తిరిగే కీటకాలకూ, గాలిలో అల్లల్లాడే గడ్డిపూలకూ, పశువుల మందకూ, వాటికేమీ కూడా - ఎతోవా ఏదో మహాభయంకరమైన సమరాన్ని గురించి మాట్లాడుతున్నాడని ఎలా తెలుస్తుంది? ఒక ఆదివాసి పశువుల కాపరిని ఎవరు లక్ష్యపెడతారు? డులాంగు, సువర్ణరేఖా నదులు - తమ ఒడ్డులపైననే ఆ మహాసంగ్రామం జరిగినప్పటికి - నిర్లక్ష్యంగా, హాయిగా, నిశ్శబ్దంగా అలా ప్రవహిస్తూనే ఉన్నాయి.

వాస్తవానికి ఎతోవా ఆ కథలను పూర్తిగా నమ్మలేదు. అవేమీ కూడా లోధా ఆదివాసి, భజన్‌భుక్త, చెప్పే పిట్ట కథల కంటె విశ్వసనీయమైనవని అతనికి అనిపించలేదు. భజన్ అంటాడు - ఒకప్పుడు ఒక బలవంతుడైన ఆదివాసి రాజు ఉండేవాడని. విదేశీయులు వచ్చి తన రాజ్యాన్ని తమ వశంలోకి తీసుకున్నప్పుడు, అతను నిరాశపడి, తన రాగి గంటనూ, మంత్రధనుస్సునూ తన కూడా పెట్టుకుని, డులాంగు నదిలో పడి ఆత్మహత్య చేసుకన్నాడని. ఈనాటికి కూడా ఎవరైనా అతణ్ని ప్రార్థిస్తే ఆ రాజు తన రాగి గంటను వాయిస్తాడని, ఏనుగుపై ఎక్కివచ్చి తన మంత్రధనుస్సుతో ప్రత్యక్షమవుతాడని కూడా చెపుతాడు. ఇంకా ఏమంటాడంటే, 'ఆ రాజు సింహంలా గర్జిస్తూ, దిక్కులన్నీ దద్దరిల్లేటట్లు ఇలా అడుగుతాడు, "ఎవరు నన్ను పిలుస్తున్నారు? నా సేన అంతా ఎక్కడుంది? ఎన్నాళ్లు నేనిలా నా రాజ్యాన్ని తిరిగి పొందేందుకు నా నేలను క్రూరమృగాలతోనూ నా ఆదివాసులతోనూ నిండిన ఆరణ్యంలా చూసేందుకు ఎదురుచూడాలి?." అలా అని అప్పుడు గంట మ్రోగిస్తాడు.

అతణ్ని ఏ ఋషాను వచ్చిన రాత్రి అయినా వినవచ్చు!

భజన్‌షుక్తా అంధుడు. సంత రోజుల్లో బజారు మధ్యన కూర్చుని పాటలు పాడుతూ, కథలు చెప్పుతూ ఉంటాడు. అప్పుడప్పుడు ఎతోవా అతనికి సాయంవెళ్లి యింటికి తీసుకువెళుతూ ఇలా అంటాడు. "తాతా, నువ్వు చాలా అద్భుతమైన కథలు చెప్పావు ఇవేళ. అందరూ నిన్ను ఎంతో తదేకధ్యానంతో విన్నారు. ఇదిగో, నీ గిన్నెలో ఎన్ని పదిపైసల నాణాలు పడేసారో ప్రజలు!"

భజన్ ఇలా జవాబు చెపుతాడు "నువ్వు మంచి బాలుడవు, ఎతోవా! కాని నా కొక్కటే బాధ - నువ్వు బడికి వెళ్లవని. దూడలను కాపలాకాయమని, వంటచెరుకు ప్రోగు చేయమని పెద్దాళ్లు పనిపురమాయించడం మూలాన మీరు కొందరు బడికి వెళ్లరనుకో. అయినా ఇప్పుడు మన ఊళ్లో బడి ఉంది. అక్కడ పాఠం చెప్పే సంతాలు పంతులు చాలా సమర్థుడు. ఇంటింటికి వెళ్లి తల్లితండ్రులతో తమ పిల్లలను బడికి పంప మని వేడుకుంటాడు. ఈ అవకాశాన్ని మీ పిల్లలందరూ ఉపయోగించుకోవాలి. ఎప్పుడూ పొట్టగురించేనా మన ఆలోచనలు! మా చిన్నతనంలో అయితే అడవిలో నాలుగు మైళ్లు నడిచి స్కూలుకి వెళ్లవలసి వచ్చేది. ఇప్పుడు ఊరూరా బడులు వున్నాయి.సరేలే. నువ్వు మీ ఇంటికి వెళ్లు నాయనా! చాలులే! ఇంక నా అంతట నేను నడిచి పోగలను."



## 2

రోజంతా ఎతోవా ఏం చేస్తూ ఉంటాడు? సూర్యభగవానుడిలాగ, ఎతోవాకి ఒక్క నిమిషమైనా విశ్రాంతి తీసుకునేందుకు ఆస్కారంలేదు. అతను అతని తాత ఒక చిల్లు గుడిసెలో నివసిస్తున్నారు. తన తల్లితండ్రులు ఎప్పుడో చనిపోతే, తన తాతే తనకు తల్లీ, తండ్రి అయినట్లున్నాడు. తన తండ్రి పెంచిన పనస చెట్టుకు రెండు మేకలను కట్టి ఉంచుతాడు ఎతోవా! అతని ముఖ్య స్నేహితుడు, సంతాలు బాలుడు, రతన్‌తూడు అన్నవాడు, తన మేకలతోపాటు ఈ రెండింటినీ కూడా మేపేందుకు బైటకు తీసుకు వెళుతూ ఉంటాడు.

గుడిసెలో తాతా, . మనుమడూ అటకలా పైకి నిలబెట్టిన.వాసాల తడికె మంచంపై





పడుకుంటారు. తెల్లవారకుండానే లేచి మంగళ్ బైటికి వెళతాడు. తెల్లవారాక లేచి ఎతోవా రాత్రి మిగిలిన అన్నపు ముద్దలు కొన్ని తిని కొన్ని తాత కోసం అట్టే బెడతాడు. తర్వాత తను పనిచేసే మోతీబాబుగారి ఇంటికి వెళతాడు.

అక్కడ బోలెడంత పని అతనికి. మొదట ఇల్లూ, వాకిలితో సహా ఆ పెద్ద బంగాళా అంతా తుడవాలి. తర్వాత 'బోరింగు' లోంచి నీళ్లు కొట్టి, ఆ ఇంటి ప్రక్కవున్న కూరల తోట అంతా తడపాలి, మొక్కలకు నీళ్లు పోయాలి. తర్వాత దూళ్లసావిడికి వెళ్లి ఆవులనూ, గేదెలనూ, పేర్లెట్టి పిలిచి, వాటిని మేపేందుకు పొలం తీసుకు వెళతాడు.

ప్రతిరోజూ, త్రోవలో బడిపంతులు మాటలు వినేందుకు కొంతసేపు ఆగుతాడు.

"ఒక వైపున ఫిరంగులు, తుపాకులు, మరి ఒకవైపున కత్తులు, కటారులు, మన సైనికులు చాలా ధైర్యంగా పోరాడారు. ఇంగ్లీషు వాళ్లు చివరకు నెగ్గారంటే దానికి కారణం వాళ్ల ఆయుధాల అధిక శక్తి వల్లనే. వాళ్ల సైనికుల క్రమశిక్షణకు తీసిపోకుండా మన వాళ్ల దేశభక్తి, ధైర్య సాహసాలు ఉన్నా ఏం లాభం? మర ఫిరంగులు, తుపాకులు మన బాహుబలాన్ని వ్యర్థపరిచాయి. కాని అది చాలా మరపురాని యుద్ధం. నిజానికి అటువంటి భీకర సంగ్రామం ఇంకెక్కడా కనీ, వినీ ఎరుగం."

ఇటు ప్రక్క ఎతోవా కూడా తన గోనుసంచీని నింపేందుకు పోరాటం ప్రతిదినం సాగిస్తాడు - పోతే, అది ఒక పోరాటం అన్న సంగతి అతనికి స్ఫురకు రాదు. దులాంగు నదిలో రోజూ తన సంచీని జాగ్రత్తగా కడుగుతాడు. వర్షాకాలంలో అది అతనికి గొడుగులా పనిచేస్తుంది. శీతాకాలంలో కంబళిలా ఉపయోగిస్తుంది. వాళ్లకి వేరే ఒక అతుకుల బొంత ఉంది. దాన్ని గనోవరు సంతలో కొన్న పాతగుడ్డలతో మంగళ్ తాత తయారుచేసాడు. ఎతోవా దాన్ని రాత్రి తాతకు కప్పేందుకు వాడుతాడు. ఎందుకంటే ముసలి తాతకి తనకంటె చలి ఎక్కువ అనిపిస్తుంది కదా! తను సంచీతో కాలక్షేపం చేసుకోగలడు.

ఎతోవా బడికి వెళ్లకపోవడం బాధపడవలసిన విషయమే. మంగళ్‌తాతకి వాడిని చదివించాలని ఎంతో కోరిక...

దీపావళి వెళ్లాక వచ్చే 'ఒన్దనా' లేక 'సొహ్రాయ్' అనే ఆదివాసుల పండుగ రోజున పుట్టాడు ఎతోవా. హాథీఘర్ నగరంలో ఆదివాసులూ, తదితర జనులూ పరస్పర మైత్రితో జీవిస్తారు. దుర్గాపూజ, కాళీపూజ వంటివి కలిసి జరుపుకుంటారు. 'జాత్ర' వినోదాలను, సంబరాలను కలిసి తిలకిస్తారు. బెంగాలీ వాళ్ల 'జాత్ర' మేళాల వంటివి



ఆదివాసులకు కూడా ఉన్నాయి. వాళ్లకు సంతాలీలోనూ లేక మందారీలోనూ జరిగే 'జాత్ర' మేళాల సంబరాలు ఎక్కువ నచ్చుతాయి. వాటిలో నటించే వాళ్లకి వీళ్లకి చాలా స్నేహం ; పైగా వాళ్ల భాష వీళ్లకు బాగా అర్థం అవుతుంది.

ఈ రోజుల్లో పులులు ఏమీ లేకపోయినా, ఒకప్పుడు పులుల బారినుండి వాళ్ల పశువులను రక్షించిన వాళ్ల పూర్వకాలపు దేవుడు, 'బాఘూట్'ను ప్రత్యేకించి ఇంకా పూజిస్తారు 'బంధనా' రోజున. పారాయణతో అలంకరించిన ఆకుల వరుసను ఆ దేవుడి విగ్రహం ముందు పరుస్తారు. అందరూ తమ తమ గోవులను దాని ముందు నడిపించాలి. ఆ పూజా స్థలంలో మొదటిసారిగా ఆకుని తిన్న గోవుని ఎక్కువ పవిత్రమైన దానిగా ఎంచుతారు. దాని కొమ్ములకు నూనె రాసి, ఎక్కువగా పారాయణతో వాటిని అలంకరిస్తారు. ఆదివాసులందరూ ఆ ఆవు యొక్క యజమాని చుట్టూ మూగుతారు. వాళ్లందరినీ ఆ యజమాని తరవాత విందుకి ఆహ్వానిస్తాడు.

ప్రజలంతా డప్పులు వాయిస్తూ ఆ ఆవుని పొగుడుతూ పాడుతూ, దూళ్ల సావిడి చుట్టూ ప్రదక్షిణం చేస్తారు. ఆవు వాళ్ల అమూల్యమైన మిత్రము.



మిగతా అందరితోపాటు ఎతోవా కూడా తిరుగుతాడు ఆవు చుట్టూ ఇలా పాడుతూ :

"మేలుకోవమ్మా భగవతి తల్లీ!
మేలుకోవమ్మ భగవతి తల్లీ!
ఈ పాడ్యమినాటి రాత్రి మేలుకోవమ్మా!

ఆవుల యజమానులు ఆ పాటగాళ్లకు బహుమతిగా డబ్బు ఇస్తారు. ఆ డబ్బుతో తర్వాత విందు జరుపుకుంటారు.

మరునాడు ఆడవాళ్లంతా కలిసి దూళ్లసాలలను శుభ్రపరిచి, మట్టితో అలికిన నేలపై తెల్లటి ముగ్గుతో 'రంగోలీ'ల వంటి బొమ్మలు గీస్తారు. ఆ అలంకారాలలో ప్రధానమైన ఆవు యొక్క డెక్క. తరువాత ఒక ఎర్రకోడి పుంజును ఒక నల్ల కోడి పెట్టను ఒక తెల్ల కోడి పెట్టను బలి యిచ్చి వాళ్ల ముఖ్యదేవతలైన 'బ్యారూబోంగా'ను 'హరామ్‌బుర్హి'ని, 'ధరమ్'ని ఆరాధిస్తారు. పూజ అయ్యాక మళ్లీ విందు జరుపుకుంటారు. తిరిగి ఇంకొకసారి స్త్రీలు ఆవుల కొమ్ములను నూనెతోనూ, పారాయణతోనూ అలంకరించాక వాటిని పొలాలకు మేసేందుకు తోలుతారు.

మరునాడు, ఆవులనూ, గేదెలనూ, సావిడి ముంగిటలో స్తంభాలకు కట్టి, వాటి చూట్టూ జనమంతా ఆడుతూ, పాడుతూ తిరుగుతారు.

ఈ విధంగా 'బంధనా' పండుగను జరుపుకుంటారు. ఎతోవా వాళ్ల ఊరిలో. కొన్ని ఊళ్లల్లో 'బాఘూట్' బదులు మరో దేవుణ్ణి పూజిస్తారు. ఆదివాసుల కొన్ని తెగలలో 'బంధనా' పండుగను ఐదు రోజులు జరుపుకుంటారు; మరికొన్ని చోట్ల మూడు రోజులు చేస్తారు పండుగను. ఆవులు లేని వాళ్లు కూడా ఉత్సవంలో పాల్గొంటారు.

ఆ ఉత్సవం రోజున ఎతోవా పుట్టినప్పుడు, అందరూ అతను చాలా అదృష్టవంతుడనీ, జీవితంలో గొప్పతనాన్ని సాధిస్తాడనీ చెప్పుకున్నారు. వాళ్ల ఆచారాన్ననుసరించి అతని నామకరణం చేయబడింది. ఒక చెంబులో నీరు నింపి, గ్రామదేవత నామాన్ని ఉద్దేశించి, ఒక ధాన్యపు గింజ, ఒక గడ్డిపరక అందులో తేలేలా పడవేసారు. 'మంగళ్' అనే పదాన్ని మానసికంగా తలచుకుంటూ, మరొక ధాన్యపు గింజను చెంబులో వేసారు. పుట్టినవాడు బాలుడైతే, అతని పితామహుడి పేరుతో నామకరణపు కర్మకాండ నిర్వహించబడుతుంది. చెంబులో వేసిన రెండవ ధాన్యపు గింజ గడ్డి పరకకు తగిలితే, ఆ బాలుడిపేరు 'ముంగ్రా' అనో లేక 'ముంగ్లా' అనో

పెట్టేవారు కానీ అలా జరగలేదు. బాలుడి తండ్రి అతనికి ఏదైనా బెంగాలీ పేరు పెట్టదలచుకున్నాడు. కాని తాత అందుకు ఒప్పుకోలేదు - ఆదివారంనాడు పుట్టాడు కాబట్టి ('ఎత్వార' అంటే 'ఆదివారం' వాళ్లభాషలో) శిశువు నామకరణం ఎతోవా అయింది.

శిశువుకి ఆరు నెలలు నిండగనే, 'ఒకురఃలుటర్' అనే వాళ్ల సాంప్రదాయికపు శుభసందర్భం జరుపుకుంటూ, అతని చెవులు కుట్టారు (అనగా వాళ్లకు 'చౌలము' ఆనవాయితీ ఉంది గాని, వేరే 'అన్నప్రాశనము' చేయబడదు). ఇంటిముంగిట ధాన్యం పరచారు. దానిమీద ఒక కుర్రపీట ఉంచబడింది. చెవులుకుట్టే సమయంలో ఎతోవాను దానిమీద పరుండ బెట్టారు. ఆ పండుగకి హాజరైన వారందరికీ బెల్లం కలిపిన వరి అన్నపు ఉండలు పంచి పెట్టారు. ఒక నల్లకోడిపుంజుని బలి ఇచ్చారు. అందరూ కలిసి విందు ఆరగించాక ఆదివాసుల తల్లులు కొంతనూనె, ధాన్యపు బుట్టలు తీసుకువచ్చారు. ఆ నూనెను ఎతోవా తలకు రాసారు. ధాన్యం అంతా ఒకచోట ప్రోగు చేసి అది శిశువుకి బహుమతిగా అందజేసారు.

మంగళ్, వచ్చిన బంధుమిత్రులందరికీ విందు చేయగలిగిన సామర్ధ్యము లేనివాడు. అయితే ఆదివాసుల ఆచారం ఏమిటంటే వచ్చిన అతిథులందరూ యాథాశక్తి వారికి తోచినది - బియ్యమో, కందిపప్పో, లేక కూరగాయలో - తీసుకువచ్చి యజమానికి అప్పచెబుతారు.

ఎతోవాకి ఒక సంవత్సరం నిండగానే అతని తల్లితండ్రులు చనిపోయారు. మంగళ్, అతని కొడుకూ, కోడలూ కలిసి పొలాల్లో పనిచేసినన్నాళ్లు వాళ్లకే లోటూ ఉండేదికాదు.

* * *

ఆదివాసుల సంవత్సరాది మాఘమాసంతో ప్రారంభిస్తుంది. ఆ దినాన్ని వాళ్లు 'మాఘ్‌చాందు' లేక 'మాఘేసిమ్' పండుగ అని అంటారు. కన్యలు వివాహితలైన యువతులు ఆనాడు పెద్దలవద్దకు వెళ్లి, వాళ్ల కాళ్లు కడిగి, వారి ఆశీర్వచనాలను పొందుతారు.

పట్టణంలో నివసిస్తున్న కనకబాబుగారి పొలాల్లో ఏటేటా కోతల రోజుల్లో పనిచేస్తూ, డబ్బు బదులు ధాన్యం పుచ్చుకుని, హాథీఘర్‌కి చెందిన సంతాలులు,

ముందాలు, లోధాలు జీవనోపాధి కల్పించుకునేవారు. కాని ఈ సంవత్సరం వాళ్లకు తెలియకుండా కనకబాబు తన భూముల్ని అమ్మేసాడు. కొత్త ఆసామీ తన సొంత పనివాళ్లకు కోతల పూచీ అప్పజెప్పాడు. తమతో చెప్పకుండా భూమి అమ్మడమే కాకుండా, తాము నాటిన విత్తనాలను అవి పండేనాటికి చేలుకోసే హక్కుకూడా తమకు లేకుండా చేయబడిందని ఆ ఆదివాసులందరూ దుఃఖించారు.

'చాంద్‌ముర్మూ' అనే ఒక సంతాలు యువకుడికి వళ్లు మండింది. అతను ఇలా అరిచాడు, "మాతో చెప్పకుండా భూములమ్మడం న్యాయమేనా? మేము గింజలు నాటాము, అవి పండి కోతకు వచ్చేనాటికి ఆ పంటలు సేకరించే హక్కు మాది కదా!"

తత్ఫలితంగా గొప్ప అలజడి జరిగింది. పోలీసులు వచ్చి ఆ హాథీఘర్ ఆదివాసులను ఆరెస్టు చేసారు.

యువకులూ, యువతులూ పోలీసు అదుపులోకి తీసుకు పోబడ్డాక, ముసలివాళ్లయిన చాంద్‌ముర్మూ తండ్రి, సుబల్, ఎతోవా తాత, మంగళ్, నడుంకట్టి, 26 మైళ్లు కాలినడకను పట్టణానికి బయలుదేరారు.

అక్కడ సంతాలు జాతికి చెందిన ప్లీడరు జైచంద్‌ని కలుసుకున్నారు. జైచంద్‌తో సుబల్ ఇలా అన్నాడు. "జై చంద్, మీ నాన్నా, నేను బాగా స్నేహంగా ఉండేవాళ్లం. మా అమ్మాయి అత్తవారి ఊరు నీ స్వగ్రామం ఒక్కటే. నువ్విప్పుడు దయచేసి మాకు సాయం చేసి మన వాళ్లనందరినీ పోలీసుల అదుపులోంచి విడిపించాలి.

జైచంద్ చాలా మంచివాడు. అరెస్టు అయిన 36 మంది ఆదివాసులనూ విడిపించగలిగేడు - కానీ ఆ ప్రయత్నానికి చాలా నెలలు పట్టింది. పట్టణాన్నుంచి వెనక్కి వచ్చే త్రోవలో ఎతోవా తల్లితండ్రులు ఏదో విషంతో కూడుకున్న అన్నం తినడం మూలాన వాళ్లని పట్టణం గవర్నమెంటు ఆసుపత్రిలో చేర్చారు. అక్కడ వాళ్లు చనిపోయారు. చాంద్‌ముర్మూ ఎతోవాని తీసుకువచ్చి, మంగళ్ ఒడిలో అతణ్ని పెట్టి తలవంచుకుని మౌనంగా నిలబడ్డాడు.

విషయం గ్రహించి మంగళ్ ఇలా అడిగాడు : "వాళ్లేం తిన్నారు, చాంద్?."

"కుళ్లిపోయిన పళ్లో లేక బూజు పట్టిన మిఠాయో నాకు సరిగ్గా తెలియదు."

"వాళ్లకి డబ్బు ఎక్కడనుంచి వచ్చింది?"

"మామా, వట్టి చేతులతో ఇంటికి రావడం కంటె ఏదో నాలుగు డబ్బులు

సంపాదించడం మేలు అనుకుని మేము త్రోవలో ఒక ఇటుక ఆవలో పనిచేసాం."

"సరే, అయిందేదో అయింది. ముసలివాణ్ని. నేను ఈ పసివాణ్ని ఎలా పెంచను? తిండి తినేందుకు డబ్బు ఎలా సంపాదించగలను?"

అప్పుడు ఆ ఊళ్లో అందరిచేత 'పెద్దమ్మ' అని పిలవబడే వృద్ధురాలు, 'ఆలోమణి' అన్న ఆవిడ ముందుకు వచ్చి, 'అన్నయ్యా, అబ్బాయిని నాకియ్యి. నేనెలాగో వాడిని పోషిస్తాను."



"చాలా మంచిదానివి, చెల్లీ, తల్లితండ్రులను కబళించాక కుర్రాడికి మంచి అదృష్టమే పట్టింది. తప్పకుండా తీసుకెళ్లమ్మా!."

"తల్లితండ్రుల చావుకి, పసిపిల్ల వాడికి సంబంధం ఏంటి?" అని మంగళ్‌ని కోపంగా అడిగాడు చాంద్.

అప్పుడు ఆలోమణి అంది, "పోనీ, బాబూ, ముసలాణ్ని ఏదో అనుకోనీ, అదంతా అతని కడుపులో బాధే కాని, అతనికి నిజం తెలీదా! అలా అంటే అతని గుండెలో మండుతున్న నిప్పు కాస్త చల్లారుతుంది. అదీ మంచిదే."

రెండు రోజుల వరకూ తెల్ల ముఖం వేసుకుని రాయిలా పడి ఉన్నాడు తన గుడిసెలో మంగళ్. మూడవ రోజున ఆలోమణి దగ్గరకు వెళ్లి అన్నాడు, "మా కుర్రాడిని మాకు ఇచ్చెయ్యి. ఇంక వాడి 'అబా', 'ఎంగా', - తండ్రి, తల్లి - నేనే."

చంటి పిల్లవాడిని భుజంమీద వేసుకుని పని అడిగేందుకోసం మోతీబాబు వద్దకు

వెళ్లాడు మంగళ్.

"నువ్వు మీ అబ్బాయి చేసిన పనులు చేయగలవా?"

"బాబూజీ, ఒకప్పుడు నేనే ఆ పనులు చేసేవాడిని, మీకు గుర్తులేదా? అప్పుడు మా వాడు స్కూలుకి వెళ్లేవాడు."

"అదే నువ్వు చేసిన పెద్ద తప్పు. మీ పిల్లల్ని మీరు బడికి పంపిస్తే మా తోటల్లోనూ, పొలాల్లోనూ, పనులెవ్వరు చేస్తారు? మా దూడల నెవరు మేపుతారు? నేనెప్పుడైనా మిమ్మల్ని దగా చేసానా? రోజుకో పూట అన్నం పెట్టేవాడిని, మధ్యమధ్య చిరుతిండి కూడా ఇప్పించేవాడిని. ఏడాదికి రెండు జతల బట్టలు, పైగా 74 కిలోగ్రాముల వరిధాన్యం ఇచ్చేవాడిని, మోతీబాబు తన కూలివాళ్లను మోసపుచ్చుతాడని ఎవ్వరనగలరు?"

"బాబూ, మీరేమిస్తారో నాకు తెలుసు నా బ్రతుకు చాలామట్టుకు మీ సేవలోనే గడిచింది. మా అబ్బాయిని చదివించాలని ఉండేది నాకో పెద్దకోరిక."

"అయితే చివరంటా బడిలో ఎందుకు ఉంచలేదు?"

"అదే ఎలా కుదిరేది, బాబూ? వాళ్లమ్మ చచ్చిపోయాక, నాకు ఎవరూ సాయంలేకపోయారు. మీరిచ్చే జీతం మా ఇద్దరి పొట్టలకు సరిపోయేది కాదు. అందుచేత మీ తమ్ముడికి దూడలు మేపే పాలేరుగా అప్పజెప్పవలసి వచ్చింది వాడిని."

"అంతా దేవుడి చేతుల్లో ఉంది, మంగళ్! ఎవరికి చదువు అబ్బుతుందో, ఎవరికి అబ్బదో, అదంతా నుదుటివ్రాతలో ఉంది."

"బాబూజీ, కర్మ గురించి మనం మాటాడవద్దు. ఇంతకీ, నాకు ఇప్పుడు పని ఇస్తారా లేదా చెప్పండి!"

"నువ్వు చాలా మొరటుగా మాటాడుతున్నావే, మంగళ్!"

"బాబూ, నేను చదువురాని ఆదివాసిని, నాకు తియ్యగా, మెత్తగా మాటలాడడం ఎలా చేతనవుతుంది? నా కొడుకు, కోడలు చచ్చిపోయారు. ఇటువంటి పరిస్థితిలో నా నోటిలోంచి తేనె పలుకులు ఎలా బయటకు వస్తాయి, బాబూ?"

"అలాగా, అదా ఇప్పుడు నీ పరిస్థితి?"

ఇంతలో మోతీబాబు తల్లి కలుగజేసుకుని అంది, "మోతీ, మంగళ్‌తో అలాగేనా మాటాడడం? అతను చాలా ముసలివాడు. ఆదివాసులందరూ అతణ్ని ఎక్కువ

గౌరవిస్తారు. అతను ఒక్కమాట అన్నాడంటే నీకింక పనిచేసేందుకు ఒక్క ఆదివాసి అయినా దొరకడు."

"సరే, అతణ్ని పనిలో చేరమను" - అన్నాడు మోతీ.

"అలాగయితే, వంటిపిల్లాడిని నా కూడా తీసుకురావాలి." అన్నాడు మంగళ్.

"అప్పుడు నువ్వు పని ఎలా చేయగలవు?

"అది నా సమస్య. మీ పని నేను లోటు లేకుండా చేసిన పక్షంలో నా గురించి మీకు బెంగ అనవసరం."

సాధారణంగా ఆదివాసులలో తల్లీ, తండ్రిలేని బిడ్డను ఆ సంఘం వారందరూ కలిసి సంరక్షిస్తారు. చాంద్‌ముర్మా భార్య వచ్చి మంగళ్‌తో అంది, "మామా, నేనిప్పుడు ఇద్దరు పిల్లలను పోషిస్తున్నాను - నా కొడుకు 'సింగ్‌రాయి'ని, నా మేనల్లుడు 'రతన్'ని ఎతోవాని నా మూడవ బిడ్డలా చూసుకుంటాను. వాళ్లు ముగ్గురూ ఖాసా అన్నదమ్ములలా పెరుగుతారు. నీ వయస్సు గురించి ఆలోచించుకుని ఎతోవాని పెంచడం సంగతి నాకు వదిలిపెట్టు."





"నాకున్నదల్లా ఎతోవా ఒక్కడే కదా, తల్లీ?"

"సరే, అల్లాగయితే నువ్వు బైటకు వెళ్లినప్పుడు, బజారు పనులు చూసుకోవలసి వచ్చినపుడు, వాడిని నా దగ్గర అట్టిపెట్టు. నీ పని నుంచి తిరిగి వచ్చాక వాడిని తీసుకు వెళ్లవచ్చు."

"మంచిది. అలా చేద్దాం."

అప్పటినుంచి సింగ్‌రాయి, రతన్, ఎతోవా అన్నదమ్ముల్లా పెరిగారు. వాళ్లకు ఆరు సంవత్సరాలు నిండేసరికి, వాళ్ల మైత్రి వాళ్లకు చాలా మంచి పేరు తెచ్చింది వాళ్ల సంఘంలో.

'కరమ్‌పూజ' అన్నది ఆదివాసుల మరో ముఖ్యమైన పండుగ. వ్యవసాయంలో సమృద్ధిగా పంటలు పండేందు కోసం ఆ పండుగను 'భాదో' (భాద్రపద) మాసంలో జరుపుకుంటారు. ఆడవాళ్లు బాగా దట్టంగా అల్లిన వెదురు బుట్టలలో ఇసుక మట్టి చేర్చి వాటిలో వివిధ రకాల విత్తనాలు నాటుతారు. కొన్నాళ్లకు విత్తనాలు మొలకలెత్తుతాయి.

మరునాడు ఇళ్ల ముంగిట పాచి చేసి 'కరమ' దేవుత పూజ కోసం అన్ని ఏర్పాట్లు చేస్తారు. రోజంతా ఉపవాసం ఉన్నాక, ఆడవాళ్లు గింజలు మొలిచిన బుట్టలను అక్కడకు తీసుకువస్తారు. వెనక్కాల కొందరు మగవాళ్లు డప్పులు వాయిస్తూ ఉంటే, లయ బద్ధంగా పాడుతూ, నాట్యమాడుతూ స్త్రీలు, పురుషులు 'కరమ్' చెట్టు యొక్క కొమ్మను కత్తిరిస్తారు. ఆ తెగగొట్టబడ్డ కొమ్మనే దేవునికి ప్రతిమగా పూజిస్తారు.

ఎతోవా, అతని ఇద్దరి స్నేహితులూ, ఆ ఆడేపాడేవారితో కలిసి వాళ్లలాగే నాట్యమాడుతూ ఇలా పాడారు.

"మేము పవిత్రమైన 'కరమ్' చెట్టు కొమ్మను తెగకొట్టాం
చూడండి, ఆ చెట్టు మమ్మల్ని ఎలా ఆహ్వానిస్తుందో!
ఈ వృక్షశాఖే మా 'కరమ్' చక్రవర్తి -
ఎంత అందంగా ఉన్నాడో మా చక్రవర్తి!"

అప్పుడు ఆ కొమ్మను ఒక మట్టి వేదికపై నాటి, దాన్ని ఆరాధిస్తారు. పూజారి చుట్టూ, గుండ్రంగా ఆడవాళ్లు కూర్చుంటారు.

'కరమ్' దేవత కథ చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. ఒక ప్రక్కనుంచి ఆ కథ చెపుతూ, పూజారిఆస్త్రీలను మధ్యమధ్య కొమ్మ ప్రతిమపై పూలను జల్లమని ఆదేశిస్తాడు. కథ అయ్యాక, ఆడవాళ్లు ఆడుకుంటూ, పాడుకుంటూ తమతమ ఇళ్లకు వెళ్లి ఉపవాసం చాలించి ఆహారం తీసుకుంటారు. అప్పుడు మగవాళ్లు నాట్యం ప్రారంభిస్తారు. అన్నం తిన్నాక ఆడవాళ్లు తిరిగివచ్చి మగవాళ్లతో కలిసి ఆటపాటలలో పాల్గొంటారు.

అన్నింటిలోకి 'కరమ్' పూజ పండుగ ఎతోవాకి ఎక్కువ ప్రీతికరమైనది. సంతాలులు, ముండాలు తమ స్వంత భూములలో నివసించే రోజులలో ఈ పండుగ ఇంకా చాలా ఘనంగా జరుపుకునేవారని అంటాడు భజన్‌భుక్తా. ఆ రోజుల్లో పొలాలు కూడా ఇంతకంటె ఎక్కువగా సస్యశ్యామలంగా శోభిల్లేవి అంటాడు అతను.





"తాతా, మన ఆ పొలాలన్నీ ఏమై పోయాయి?" అని అడిగాడు ఎతోవా.

"అంతా మెరుపులాగ మాయమై పోయింది, బాబూ!"

"అయితే మనం ఇంకా ఈ 'కరమ్' పూజ ఎందుకు చేస్తూంటాం!"

"ఇంకా మనలో కొందరికి భూవసతి ఉంది. అదీకాక, ఆ కాలం, ఋతువు వచ్చినప్పుడు వాటికి సంబంధించిన పండుగ చేసుకోడం మన ఆచారం."

ఈ పండుగల యొక్క కర్మకాండను ఎతోవాకు బోధపరచడానికి ప్రయత్నించాడు 'సుబల్ముర్మూ', 'రతన్' అంటాడు హైస్కూలులో సరస్వతీ పూజ కూడా చేస్తూంటారని.

"అవును, ఆ మాట నిజమే. అక్కడ చదివిన మన కుర్రాళ్లు పదిమంది బడిపంతుళ్లు అయారు. అలాంటి చదువు మనం చదవకపోతే, మన ఆదివాసుల భవిష్యత్తు హీనంగా ఉంటుంది.

ఆలోమణి అంది, "మా చిన్నతనంలో మాకు చదువుకునేందుకు ఏమీ అవకాశాలు ఉండేవికావు. ఇప్పుడు ఆడపిల్లలు కూడా స్కూలుకి వెళ్లవచ్చు. మా తమ్ముడు వాళ్లమ్మాయిని పట్టణంలోని వసతి పాఠశాలకు పంపాడు."

"మన పిల్లలకు చదువు చెప్పించకపోవడం మూలాన మనం అనేక బాధలు పడుతున్నాం. అందరికీ 'గురుసింగ్' మాధయ్యకు పట్టిన అదృష్టం లేదు కదా!"

'గురుసింగ్' మాట వినేసరికి అందరికీ నవ్వు వచ్చింది. ఎతోవా అనుకున్నాడు - ఒకరోజున గురుసింగ్ గురించిన కథ వినాలని.

# 3

ఎతోవాకి ఏడు సంవత్సరాలు నిండేసరికి, మంగళ్ అన్నాడు. "రా, నేను నిన్ను బడికి తీసికెళతాను. నీ నిక్కరు మరమ్మతు చేసాను. చొక్కా కొంచెం చిరిగింది, అయినా పరవాలేదు, అది శుభ్రంగా ఉంది, అదే చాలు."

సంతాల్‌జాతికి చెందిన పంతులు, గంగాధర్ హేమ్‌బ్రోమ్, స్కూలు రిజిస్టరులో ఎతోవా పేరు, రోలు నెంబరు, వ్రాసుకొని మంగళ్‌తో అన్నాడు. "వాడికో పలకా, పుల్లాకొను. పుస్తకాలు, నోటుబుక్స్, పెన్సిలు నేను వాడికిస్తాను.

"పుస్తకాలెప్పుడిస్తారు?"

"ప్రభుత్వం వారు మాకు పంపగానే ఇస్తాం. ఈ ఏడాది పాఠాలు మొదలుపెట్టి చాలాకాలం అయినా, ఇంకా పుస్తకాలు మనకు అందలేదు. రోజు విడిచి రోజు వాటి గురించి కనుక్కునేందుకు నేనే పట్టణం వెళుతున్నాను. మన రోడ్లెంత చెడ్డవో నీకే తెలుసు. మామా, నువ్వు నన్ను 'హాథిఘర్ ఆదివాసి క్లబ్' పాలక వర్గానికి పరిచయం చేయగలవా?"

"అల్లాగే కాని, పంతులుగారూ, మా వాడు చక్కగా వ్రాయడం, చదవడం నేర్చుకునేలా చూడండి. వాళ్ల నాన్నను కూడా బడికి పంపాను, కాని వాడి చదువు కొనసాగలేదు, పొలంపని లేకపోతే ఆదివాసికి ఇంట్లో తిండి ఉండదు, అందుచేత మేము బడికి బదులు పనిచేసి తిండి సంపాదించేందుకు మా పిల్లలను పెద్దబాబుల ఇళ్లకు పంపవలసి వస్తోంది."

"అవును, మామా, ఈ సమస్య అందరికీ వున్నదే. ముఖ్యంగా మన ఆదివాసులకు ఇది పెద్ద చిక్కు. మా పెద్దాళ్లతో దెబ్బలాడి నేను స్కూలుకి వెళ్లవలసి వచ్చింది - 'మోహినీ' పురం బడికి వెళ్లే ముందు అక్కడ నాకు స్కాలర్‌షిప్ వచ్చినా అది చాలక బాబుగారి తోటలో కూడా పని చేయవలసి వచ్చేది. స్కూలుకి, పెద్దవాళ్ల అనుమతి లేకపోవడం మూలాన, నేను చాటుగా పరిగెత్తవలసి వచ్చింది. అయితే ఎప్పుడైతే నేను మొదటి పరీక్షలో క్లాసులో రెండవవాడిగా పాసయ్యానో అప్పటినుంచి నా చదువు గురించి మా నాన్న అడ్డుపెట్టడం మానేసాడు."

"ఆ... మనకు చదవడం, వ్రాయడం చేతకాక కోర్టుకెళ్లడం అంటే భయపడేవాళ్లం కాబట్టి, ఆ బాబూ కామందులు మనవన్నీ భుక్తం చేసుకున్నారు - మన భూములూ, మన పశువులూ..."

"అవును, మామా, చదువు చాలా ముఖ్యం. మనకు విద్య లేదు కాబట్టి, మన కోసం ప్రభుత్వం వారు ప్రవేశపెట్టిన అభివృద్ధి పథకాల గురించి కూడా మనకు సరిగ్గా తెలియదు."

"సరి, మా ఎతోవా ను నీ చేతుల్లో పెడుతున్నాను.

"మరేం బెంగ పెట్టుకోకు... చూడు, ఎతోవా, నీకు బెల్లం, మిఠాయి ఎవరైనా పెడితే నువ్వొక్కడివే తింటావా, నీ స్నేహితులకు కూడా పంచిపెడతావా?"

"నా స్నేహితులతో పంచుకుని వాళ్లతో కలిసి తింటాను."



"బాగుంది. మంచి వస్తువలన్నీ అలా అందరూ పంచుకోవాలి. బడి అంటే ఇలాంటి మంచి అలవాట్లు కలిగే చక్కని చోటు. నీ స్నేహితుల్ని కూడా బడికి తీసుకురా."

"అల్లాగే వాళ్లను కూడా రమ్మంటాను."

"ఇవేళ నీకు మన భారతదేశం ఎంత పెద్దదో చూపిస్తాను."

"భా-ర-త-దే-శం. 'భారతదేశం' మన దేశమా?

"చూడు, ఇదే 'భారతదేశం', లేక ఇంగ్లీషులో, ఇండియా యొక్క రేఖాపటం. దీన్ని 'మాప్' అంటారు.

"ఇందులో 'హాథీపుర్' ఎక్కడుంది?"

"ఇక్కడ మన రాష్ట్రం, పశ్చిమబెంగాలు ఉంది. ఇందులో ఇక్కడ మన మిడ్నపూర్ జిల్లా ఉంది. ఇక్కడే మన హాథిపుర్ ఎక్కడో నైరుతి దిక్కున ఉంటుంది."

"అయితే అది కనుపించదేం?"

"అది మన జిల్లా మాప్‌లో ఉంటుంది. తర్వాత తీసుకొచ్చి చూపిస్తాను. కాని నువ్వు హాథీపుర్ ఎక్కడుందో ఎలా కనుక్కోగలవూ?"

"ఓ! నేను చదవడం నేర్చుకుని, అప్పుడు కనుక్కుంటాను."

"భేష్, ఆ మాటే నేను వినదలచుకున్నాను. ఇప్పుడే నల్లబల్లకేసి చూడు. మన బడిలో మొదటి అక్షరం 'అ' వ్రాసి చూపిస్తున్నాను. 'అ', అదే నువ్వు ముందు నేర్చుకోవాలి."

"అ, అ, అ."

"ఇప్పుడది నీ పలక మీద దిద్దు. అది ఎలా వ్రాయాలో నీకు చూపిస్తాను.

అప్పటినుంచి చదువుపైనా, పంతులుపైనా ఎతోవాకు ఎంతో ప్రేమ కలిగింది. పంతులెంత దయతో, ఓర్పుతో చదువు చెపుతున్నాడు! కాని ఎతోవాకి ఒక్కటే చింత: తన బడి పాఠాలలో మొట్టమొదటి పూర్వకాలపు యుద్ధాల కథలు చెప్పడం లేదని.

* * *

బడినుంచి ఇంటికి వెళ్లే త్రోవలో, ఎతోవాకి కొత్త సైకిలు మీద మోతీబాబు ఎదురయ్యాడు. సైకిలు ఆపి అడిగాడు.

"అయితే మంగళ్ మనవడిని స్కూలుకి పంపుతున్నాడన్నమాట?"

"అవును, బాబూజీ!"

"అతను చాలా తప్పు చేస్తున్నాడు. తన మనవడికి పని ఇస్తానని ఈ మధ్య మంగళ్‌తో నేను చెప్పాను.

ఎతోవా నిశ్శబ్దంగా నిలబడ్డాడు.

"మీరందరూ చదువుకునేందుకు పోతే మాకు పని చేసే వాళ్లెవరు? ఏమయినా, ఎన్నాళ్లు చదవగలవేం! నీకింట్లో సరిపోయే కూడు ఉందా?"

ఆ మాట అని రావి చెట్టు దాటి బాబు వెళ్లగానే, ఎతోవా పరిగెట్టి తన తాత దగ్గరకు వెళ్లాడు. ఆ చెట్టు చాలా పురాతనమైంది. దానిలో పాములు నివసిస్తున్నాయని చెప్పుకుంటారు. కాని ఆ మాట నిజం అయి ఉండదు. నేల చెరియలలో ఉంటాయని, ఎప్పుడైనా పక్షిగూడులో గుడ్లు తినేందుకు మాత్రం చెట్టు ఎక్కుతాయి అని, ఎతోవాకు తెలుసు. పాములు చాలా ప్రమాదకరమైనవి. చాటుగుండా ఇళ్లల్లోకి ప్రవేశించి (కొండచిలువలు) అవి మనుష్యుల్ని కాటేస్తూ ఉంటాయి. నీటిపాములు, ఎలుక పాములు, విషపూరితమైనవి కావు కానీ, 'ఎలుకపాములు', (కొండచిలువలు) తమ తోకతో మనిషిని పెద్ద దెబ్బకొట్టగలవు. కాని వాటి మాంసం తినే సంతాలు జాతివారు అది చాలా రుచికరంగా ఉంటుందని అంటారు.

"వాటి మాంసం మామూలు ఎలుకల మాంసంలా ఉంటుందా?"

"కొంచెం తేడా ఉంటుంది."

మంగళ్ ఇటువంటి మాంసం తినడు. కాని తన స్నేహితులతో కలిసి ఎతోవా, ఎలుకలు, ముళ్ల ఎలుకలు, పాములు మొదలైన వాటి మాంసం తింటాడు

ఇంటికి చేరుకోగానే తన మీద మోతీబాబుకి తను బడికి వెళ్లడం గురించి, చాలా కోపం వచ్చిందని తాతతో చెప్పాడు ఎతోవా.

"అవును నాకు ఆ మాట తెలుసు మనవాళ్లు చదువుకోవడం మోతీబాబుకి ఇష్టం ఉండదు. కాని ఆదివాసుల పిల్లలు చదువుకునేందుకు వాళ్లు ఉండే ప్రాంతాలలో ప్రభుత్వం పాఠశాలలు పెట్టింది. ఆదివాసికి చదువు, రాత నేర్చుకోవడం చాలా అవసరం. పోతే, అందరికీ గురాసింగ్‌కి పట్టిన అదృష్టం పట్టదనుకో."

"గురాసింగ్ ఏం చేస్తూంటాడు."

"తర్వాత ఒక రోజున అంతా చెపుతాలే."

ఇద్దరూ కలిసి మేకలను లోపలికి తీసుకువచ్చారు. 'బోరింగు' నుంచి నీళ్లు తెచ్చి ఎతోవా కుండలో పోసాడు. మంగళ్ నిప్పు అంటిస్తూ ఎతోవాను చేపలు

తరగమన్నాడు వండేందుకు.

"తాతా, ఏంటి నీ డబ్బంతా చేపలు కొనేందుకు ఖర్చు పెట్టేసావా?"

"ఏదో కొంచెం నువ్వు ఇవాళ బడిలో చేరావు కదా. కాస్త సరదాగా ప్రత్యేకించి విందు చేసుకోవాలి మనం!"

ఇంతలో తాతతో కబుర్లు చెప్పేందుకు సుబర్‌ముర్మ్ము వచ్చాడు. ఇద్దరూ బీడీలు కాలుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్లు బాల్య స్నేహితులు. విలువిద్యలో నిపుణులు. ప్రాంతీయ పోటీలలో వాళ్లు చాలా బహుమతులు సంపాదించుకున్నారు. సాధారణంగా ఆదివాసులందరూ మంచి వస్తాదులు, ఆటగాళ్లు. తరుచు – హైస్కూలు వార్షికోత్సవంనాడు, బిర్సామున్డా వర్ధంతినాడు ; వీర మరణం పొందిన సిధూ, కన్హూల పుణ్యతిథినాడు ; ఆటల జల్సా రోజున – ఏవేవో ఆటల పోటీలు జరుగుతూనే ఉంటాయి. కొందరు లోధా అమ్మాయిల్లు కూడా విలువిద్యలో నేర్పరితనం కలిగిన వారే కాని, వాళ్లు ఈ పోటీలలో పాల్గొనరు.

నెమ్మదిగా ఎతోవా, సుబర్‌ముర్మ్ముతో ఇలా అన్నాడు. "సింగ్‌రాయి, రతన్– ఇద్దరూ కూడా బడికి రావాలి అని మా పంతులు అంటున్నాడు."

"ఆ మాట నిజమేకాని, మోతీబాబుగారి 50 ఆవులనూ, గేదెలనూ వాళ్లిద్దరిచేత మేపిస్తానని ఆయనకు మాట ఇచ్చాను."

మంగళ్ నిట్టూరుస్తూ అన్నాడు, "ఎన్నాళ్లు మనకి బానిసతనం! రోజుకి ఒక పూట భోజనం ఏడాదికి రెండు జతలు బట్టలూ, కొంచెం ధాన్యం, వీటికోసం మనవాళ్లు చదువూ, సంధ్యా మానుకుని ఎక్కడో వెట్టిచాకిరి చేయాలి. ప్రపంచం అంతా ముందుకు సాగుతూంటే, ఈ ఆదివాసి పిల్లలు విద్యా, వికాసం లేకుండా పడిఉండవలసి వస్తోంది."

"అవును, అందరూ గురాసింగ్ అంత అదృష్టవంతులు కాలేరు."

ఎతోవా అన్నాడు, "ఇవాళ నువ్వు నాకు గురాసింగ్ గురించి అంతా చెప్పాలి."

అల్లాగే, అల్లాగే అన్నాడు సుబర్. "కాని, ముందు చేపలు కడిగి కోయి. మంగళ్‌కి ఇంకా వాటిని వండడం జ్ఞాపకం ఉందో లేదో చూస్తాను. ఒకప్పుడు అతనికి వంట చేయడం చాలా బాగా అలవాటుండేది. మా వేట పండుగల సందర్భంలో అతనే మాంసం వండేవాడు. అన్నా, మంగళ్! అయ్యో, ఇప్పుడు ఆ మృగాలేవి? ఆ అడవులేమై పోయాయి?"

ఎండిన గొంతుతో మంగళ్ అన్నాడు, "కొన్ని ప్రాంతాలు ఒరిస్సా రాష్ట్రంలోని నయాగ్రామం చుట్టూ ఇంకా మన స్వాధీనంలో ఉన్నాయి. ఇప్పుడు కట్టబడుతున్న సువర్ణరేఖానదిపైన వంతెన వల్ల రాష్ట్రానికి కొన్ని లాభాలు కలగవచ్చును కాని, మిగిలిన అడవులు నశించిపోయి, మనకు ఎడారి ప్రాంతం మట్టుకు మిగులుతుంది."

"అలా జరిగే ముందు మన పిల్లలను ఒకసారి అక్కడికి తీసుకుపోదాం.

పూర్వం మనవాళ్లు ఎలా జీవించేవారో వాళ్లు ఒకసారి చూస్తారు."

"అలాగే, తప్పకుండా తీసుకువెళదాం."

అప్పుడు ఎతోవా అడిగాడు, "ఉత్తి అడవిలో జీవించి రోజు ఎలా గడుపుకుంటారు?"

ఆవేశంతో కూడుకున్న గొంతుతో సుబల్ అన్నాడు, "మహువా గింజల నుంచి



నూనె ఆడి దానితో వంట చేసుకుని, దీపాలు వెలిగించుకుంటారు. ఆ 'మహువా' పువ్వును ఎండబెట్టి దానితో చిన్న రొట్టెలు తయారు చేసుకుంటారు. వాళ్లు దుంపలూ, కందమూలాలూ, ఆకులూ, పండ్లతో కాలక్షేపం చేసుకోగలరు. అప్పుడప్పుడు దొరికితే లేడి మొదలైన చిన్న జంతువులదీ, కాకి మొదలైన పక్షులదీ మాంసం వండుకుని తింటారు. అన్నం పెట్టుకు తినేందుకు 'సాల్' ఆకులు వాడుతారు. ఇంకా వేప, 'సాల్' గింజల నుంచి కూడా నూనె సేకరిస్తారు."

"చాలా అద్భుతమైన జీవితంలా తోస్తుంది."

"ఒకప్పుడు ఆదివాసులందరూ అలాగే బ్రతికేవారు. అడవి మన తల్లి. మనం ఆమె బిడ్డలం. మనకు వ్యవసాయం చేయడం చేతనయ్యాక మన వాళ్లు అడవులను విడిచిపెట్టలేదు. కాని కాలం మారింది, ఎతోవా! మనం రోజు గడుపుకోవాలంటే మన ఆదివాసులం కూడా కాలంతో మారాలి."

"సుబల్, అందుమూలానే నేను నీ పిల్లలను బడికి పంపమంటున్నాను."

"ఆలోచిస్తాను. ఈ ఏడాది కాకపోతే, వచ్చే ఏడాదైనా పంపేందుకు..."

"సరేకాని, తాతా, నాకు గురాసింగ్ కథ చెప్పడం మొదలుపెట్టవా?"

సుబల్ అన్నాడు "ఆ కథ గురించి అస్తమానం మీ తాత నెందుకు అడుగుతావు? నేను నీకు చెపుతాను నువ్వు ఇప్పుడు బడికి వెళుతున్నావు కాబట్టి తప్పకుండా ఆ సంగతి వినాలి. నిజానికి ఆ కథ వినడం వల్ల ప్రతి ఆదివాసికి జీవితంలో ముఖ్యమైన పాఠం నేర్చుకునే అవకాశం ఉంటుంది..."

" ఊ. ఇది ఈ మధ్యనే జరిగింది, కాని ఎంతో కాలం అయిపోయినట్లు అనిపిస్తూంది. సువర్ణరేఖా నది ఒడ్డున ముందాలకూ, లోధాలకూ చెందిన చాలా గ్రామాలు ఉండేవి. గురాసింగ్‌కి అక్కడ ఎన్నో భూములు ఉండేవి... ఆ, మంగళ్, ఇది చెపుతుంటే నాకు మీ ఎతోవా మాట ఒకటి చెప్పాలనిపిస్తూంది. వాడు నిజంగా రత్నం లాంటివాడు. సంత రోజులలో వాడు భజన్‌భుక్తతో కలిసి ఇంటికి నడుస్తూ ఉంటాడు. భజన్‌కు కూడా ఒకప్పుడు భూమి ఉండేది. అందుచేత... సరే, చెప్పొచ్చేదేమిటంటే, గురాసింగ్ ఒక గొప్ప భూస్వామి. అతనికి 5 గురు కొడుకులు, 10 పశువులు ఉండేవి. అతని కొడుకులందరూ మూర్ఖులు, చదువురానివారు. పైగా అతనికి తాగుడు అలవాటు ఉండేది."

"బాబూ, సుబల్, మనం ఆదివాసులం సారాని కాదు తాగేది - సారాయే మన్ని తాగేస్తుంది" అని మధ్యలో అన్నాడు మంగళ్.

"ఆ మాటా నిజమే, కాని మన బాధలు మరిచిపోయెందు కోసం కదా మనం తాగేది?"

"మన వాళ్లు పూర్వం మన ఊళ్లల్లో తయారుచేసే హెండియా అయితే ఏం అపకారం చేసేది కాదు కాని, ఇప్పుడిక్కడ బజారులో అమ్మే సారా మట్టుకు మన్ని నాశనం చేస్తోంది."

"అదే గురాసింగును అంతం చేసింది. ఆ సారా దుకాణదారుడు గోపి అనేవాడు, నువ్వు అస్తమానం రొక్కం ఇవ్వనక్కరలేదు, గురా, నీకు కావలసినంత తాగు. మా కాతా పుస్తకంలో నీకయిన ఖర్చు రాస్తాను. నువ్వు చేయవలసినదల్లా ఈ తెల్లకాగితం మీద నీ వేలిముద్ర వేయడమే అని."

"అంటే అలా చేసేసేవాడా గురా!"

"ఇంకేమిటనుకుంటున్నావ్? ఒక ఏడాది పోయేసరికి గురాసింగ్, తనకింక 10 బీగాల భూమి మాత్రం మిగిలింది అని తెలుసుకున్నాడు - మిగతాదంతా తాగుడు అప్పు తీర్చేందుకు గోపికి భుక్తం అయిపోయింది. ఏడుస్తూ మా దగ్గరకొచ్చి ఇలా అన్నాడు గురా, "నేను చాలా చిక్కులో ఇరుక్కున్నాను, అన్నా! గోపి నన్ను కోర్టుకీడుస్తున్నాడు. అతనికి నేను ఆ భూమి అమ్మినట్లు అక్కడ స్టేట్‌మెంటు ఇవ్వాలిట." అప్పుడు నేను, మంగళ్, మిగతా పెద్దలూ కలిసి 'ఇంకెప్పుడు సారా తాగనని' గురా చేత ఒట్టు పెట్టించాం. తర్వాత పట్టణం వెళ్లి ఒక తెలివైన సంతాలు ప్లీడరును కలుసుకునేందుకు ఒక రోజు నిర్ణయించాం.

"ఆదివాసి ప్లీడరా?"

"అవును, బాబూ! ఆదివాసులు కూడా చదువుకుంటే ప్లీడర్లు, టీచర్లు కాగలరు - ఇప్పుడు మన ఆడపిల్లలు కూడా టీచర్లు, నర్సులు అవుతున్నారు. మేము కలుసున్న ప్లీడరన్నాడు, 'ఈ గోపికి, గురాసింగుకి ఇద్దరికి కూడా ఓ దెబ్బతినిపించాలి', అని ఆయన మాటలలా ఉంటాయి. ఆఖరికి ఆయనేమన్నాడంటే, 'గురా, నువ్వు కోర్టులో వాళ్లు ఏమి అనమంటే అదే అను నీ అంతట నువ్వు ఒక్క మాటైనా పైకి రానీకు అని."...

"తరువాత ఏమయింది?"

"కోర్టులో బంట్రోతు పిలిచాడు, 'గురాసింగ్! గురాసింగ్!' అని ప్లీడరు మాట పట్టుకుని, గురాసింగ్ కూడా 'గురాసింగ్! గురాసింగ్! అని అరిచాడు. అప్పుడు కోర్టు వాళ్లు అన్నారు. 'సరిగ్గా జవాబు చెప్పు. నువ్వేనా గురాసింగువి?' అని. మళ్లీ గురాసింగు 'సరిగ్గా జవాబుచెప్పు. నువ్వేనా గురాసింగ్‌వి? అని చిలకలా పలికాడు. ఇలాగ ఎంతసేపో ఉత్తరప్రత్యుత్తరాలు, ధ్వని, ప్రతిధ్వనిలా జరిగాయి. మేజిస్ట్రేటుకి ఏం చేయాలో తోచలేదు. అప్పుడు గోపీ తరపున పనిచేస్తున్న ప్లీడరన్నాడు, 'నువ్వేమైనా గాడిదవా! ఎందుకిలా తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నావ్?' అని గురా కూడా మళ్లీ ఆ ప్లీడరన్నమాటలే నిక్కచ్చిగా జవాబు చెప్పాడు. ఇంతలో మేజిస్ట్రేటు కలుగజేసుకుని అడిగాడు. "నీకు చిన్న చిన్న మాటలు అర్థం కావా? నువ్వంత మూర్ఖుడివా?" పూర్వంలాగే మేజిస్ట్రేటు అన్నమాటలే గురా తిరిగి అన్నాడు. మేజిస్ట్రేటుకు వళ్లు మండింది. అన్నాడు – 'నేనీ కేసు పరిశీలించను. కేసు కొట్టేసాను. ఇంత మూర్ఖుడిని ఈ కోర్టుకు ఎందుకు తీసుకువచ్చారు? అని."

"తర్వాత?"

"తర్వాత మన సంతాలు ప్లీడరు మేజిస్ట్రేటుకు విషయం అంతా బోధించాడు. గోపీకి సిగ్గేసింది. పైగా జుర్మానా కూడా చెల్లించవలసి వచ్చింది అతనికి. అతను ఆదివాసుల భూమి కొనదలచుకోడం అంతా చట్టానికి వ్యతిరేకం అని కనిపెట్టారు."

"అయితే గురాసింగ్‌కి తను పోగొట్టుకున్న భూమి అంతా తిరిగి లభించిందా?"

"మరి! అప్పుడు వాళ్లందరూ కాఫీ హొటలుకు వెళ్లారు. గోపీ కూడ అక్కడకు వెళ్లి అరిచాడు, 'గురా, నువ్వు చేసిన తమాషాకు నిన్ను చంపేస్తాను' అని. గురా కోర్టులోలాగే ఆ మాటలే తిరిగి అన్నాడు. తర్వాత మేమందరం కలిసి గోపీని అక్కడనుంచి తరమివేశాం.

"గోపీ పారిపోయి, ఇంతవరకూ తిరిగిరాలేదు. దాంతో వాడు ఆదివాసులను తాగించి వాళ్ల భూములను స్వాధీనం చేసుకుందామనుకున్న కుట్ర ముగిసింది. ఇంకా బజారులో వాడి కొట్టును కూడా తీసి పారేయించాం. ఇదీ గురాసింగ్ కథ. అది ఒక్కటే ఒక చదువురాని ఆదివాసి ఇతరుల్ని ఓడించి తన భూమిని నిలబెట్టుకున్న సందర్భం."



మంగళ్ అన్నాడు, "గురాసింగ్ కనుక చదువుకున్నవాడైతే వాడి పరిస్థితి అంతవరకూ వచ్చి ఉండి ఉండదు. దీన్ని బట్టి మనం తెలుసుకోవలసింది ఏమిటంటే, ఎన్ని ఇబ్బందులున్నా ఆదివాసులు చదువుకునేందుకు పట్టుపట్టాలని."

* * *

ఎలోగా పుస్తకాలు సంపాదించుకునేసరికి, వేసవి సెలవులు వచ్చిపడ్డాయి. అతని ఉపాధ్యాయుడన్నాడు, "సెలవుల్లో అక్షరాలు దిద్ది బాగా నేర్చుకో. మళ్లీ బడి తెరిచాక పుస్తకంలో పాఠాలు చదవడం మొదలుపెట్టుదువుగాని," అని.

"మీరు కూడా మీ ఊరు వెళతారా సెలవులకు, సార్?"

"అవును, నేను కూడా ఇంకా బాగా విషయాలు నేర్చుకోవాలి."

"ఎందుకు ? మీరు ఇప్పుడే టీచరయ్యి పోయారు కదా?"

"ఇంకా మంచి టీచరునయేందుకు ఇంకా బాగా చదువుకోవాలి నేను. నువ్వు బాగా చదవాలంటే ఎక్కువగా శ్రమపడి నేర్చుకోవాలి. నువ్వు శ్రమపడి నేర్చుకుంటే, క్లాసులో ఫస్టు రావచ్చు. ఏం చెప్పగలం?"

అవును, ఎతోవాకు బాగా చదువుకోవాలని ఉంది కాని, వాళ్ల తాతకు తను సహాయం చేయవలసిన పరిస్థితి తప్పదని కూడా గ్రహించాడు. పైగా మోతీబాబింట్లో ఎంతో పనిచేయాలి. అన్నిపనులూ ఒక్క మంగళ్ చక్కబెట్టుకోలేడు.

*　　　*　　　*

వేసవి సెలవుల్లో చాలా సంఘటనలు జరిగాయి. రతన్, సింగ్రై, ఎతోవా - ముగ్గురూ కలిసి మళ్లీ ఆటలాడడం మొదలుపెట్టారు. ఎతోవా వాళ్లకు గురాసింగ్ కథ చెప్పాక అందరూ పొట్టచెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

ఆ సెలవుల్లో భజనభుక్తా మనుమరాలు 'సోనా' పెళ్లి అయింది. ఎతావాతో భజన్ అన్నాడు, "నేను బీదవాణ్ని. ఎక్కువమందిని పెళ్లికి పిలవలేను. కాని నువ్వు మట్టుకు తప్పకరావాలి."

ఆ మాటలు విని, ఎతోవా పెళ్లికి వెళితే చుట్టూ ఉన్న కంచె పని ఎవరు చేస్తారని అడిగాడు మంగళ్.

"ఓ, పెళ్లి ఒక్కరోజులో అయిపోతుంది. తర్వాత కంచె నిలబెడతాను. డులాంగునంది ఒడ్డునుంచి క్యాక్టస్ (చెముడు) ముళ్ల మొక్క కొమ్మలు తెచ్చి కంచె చుట్టూ పాతుతాను. ఆ ముళ్ల మొక్కలు తినబోతే ఈ దొంగ మేకలకు కాస్త బుద్ధి వస్తుంది. వర్షం వచ్చాక ఆ మొక్కల కొమ్మలు పెరిగి పెద్ద మొక్కలవుతాయి కదూ?"

" ఆ మాట నిజమే. కాని, ముఖ్యంగా నువ్వు చదువుకోవాలి."

"నేను చదువూ చదువుతాను. పనీచేస్తాను. చూస్తావుగా!"

"మంచిది, నువ్వు పెళ్లికి వెళ్లవచ్చు. భజన్‌కి నువ్వంటే చాలా ఇష్టం."

కోతలు కోసాక చేనులో విడిచిపెట్టిన వరితూడులను 'తంగ్' అంటారు. దాన్ని ఊళ్లో అంతా పీక్కుని పోగుచేసుకోవచ్చు. కాని ఆ కాస్త కోసం మానవులు పొలం ఎలుకలుతో పోటీ పడాలి. ఈ పందికొక్కులు నేలక్రింద గూడులు తవ్వి అందులో ఆ కాడలు పోగుచేస్తాయి. ఆదివాసులు ఆ ధాన్యపుకాడలను బైటికి లాగుతారు ; అలా లాగేటప్పుడు ఏవైనా ఎలుకలు దొరికితే వాటిని చంపి వండుకుని తింటారు. ఈనాటికి కూడా లోధాలు ఎలకలను తింటారు. ఇంకా బల్లులు, పాములు, పీతలు, అల్లాంటివి ఏవి దొరికినా సరే తింటారు.

ఈ విధంగా వాళ్లకి అడవి రహస్యాలన్నీ చక్కగా అవగాహన అవుతాయి. ఇప్పుడు వ్యవసాయంలోకి దిగిన లోధాలకు కూడా వాళ్ల పూర్వపు వేటాడే నైపుణ్యం తరగలేదు. వాళ్లు పాటలు పాడి నాట్యం చేసేటప్పుడు వాయించే 'భంగు' డప్పులను మేక తోలుతో తయారు చేస్తారు. మరే దేవుళ్లని, దేవతలను వారు పూజించినా పూజించకపోయినా, 'శీతల' ఉత్సవం మట్టుకు, ముఖ్యమైన పండుగగా తప్పక జరుపుకుంటారు.

ఎతోవా మంగళ్‌తో అన్నాడు. "సెలవుల్లో నేను ఆవులను మేపేందుకు తోలుకెళతాను. నువ్వేమో కూరగాయల తోటలలో మొక్కలకు నీళ్ళు పోయి, నా మామూలు పని మోతీబాబు గారింట్లో వాకిలి తుడవడం ఎలాగైనా రోజూ పూర్తి చేయగలను."

"ఇంక చదువు ఎప్పుడు చదువుకుంటావు?"

"సాయంత్రం చదువుకుంటాను చూద్దువుగాని."

"సరే, జాగ్రత్తగా కాలక్షేపం చేయి."

"ఏం, నీకేదైనా బెంగగా ఉందా నా గురించి?"

"ఏంలేదు. నేను రోజస్తమానం ఊరికే పనిచేయకుండా కూర్చోలేను. ఈత కొమ్మలు కొట్టి, వాటితో చాపలు అల్లుతాను. పూర్వం ఆ పని ఎక్కువగా చేస్తూ ఉండేవాడిని."

ఎతోవా దూడలను సావిడి నుంచి బైటకు తోలుకెళ్తున్నప్పుడు, మోతీబాబు అతడ్ని చూసి ముచ్చటపడ్డాడు.

"అయితే మీ తాతకు సాయం చేయడానికి సిద్ధపడ్డావన్నమాట."



"అవును, బాబూజీ, సెలవుల్లో మాత్రమే."

"ఏంటి, తర్వాత బడికి వెళతావా?"

అవునన్నట్లు తల పైకి కిందికి ఆడించాడు, ఎతోవా. అతనితో బడి పంతులు చెప్పిన మాటలు మోతీబాబు కెలా తెలుస్తాయి ?

ఆ ఉపాధ్యాయుడేమన్నాడంటే - సెలవుల తర్వాత సంతాలు, ముందా, లోధా జాతుల ఆదివాసి పిల్లలను స్కూలులో చేర్పించి వాళ్లందరకూ కథల పుస్తకాలు చదివి వినిపిస్తానని ; పరీక్షలయాక తన సొంత డబ్బు వెచ్చించి వాళ్లకు బహుమతులు పంచి పెడతానని, ఆయన చెప్పిన ఈ మాటలు ఎతోవాకి బాగా జ్ఞాపకం వచ్చాయి, "ఎతోవా, పూర్వపు రోజుల్లో మీకు విల్లు, బాణం ఉంటే సరిపోయేవి, కాని ఇప్పుడు మీరు బ్రతకాలంటే మీకు చదువే మీ ఆయుధం" అని ....

మోతీబాబు ఆవులను, తన మేకలను తోలుకుని డులాంగు నది దాటి సువర్ణరేఖానది ఒడ్డున ఇసుక తిన్నెలు చేరుకునే సరికి ఎతోవాకి ఒక వింత స్వేచ్ఛాభావం, ఆనందం కలిగాయి. తన చేతులు పైకెత్తి గిర్రున తిరుగుతూ, ఎగురుతూ నాట్యమాడాడు. నదిలోకి తన చేపల వల విసిరి, ఆ ప్రక్కన ఉన్న ఎత్తైన గడ్డి చేనులోకి నడిచి వెళ్లాడు. అక్కడ ఒక ముసలి కుందేలు నివాసం ఏర్పరచుకొని ఉందని కనిపెట్టాడు. అయినా దాని జోలికి పోదలచుకోలేదు. అతను దాన్ని తను చంపడు సరికదా, అది అక్కడ ఉన్నట్లు ఇంకెవరికీ చెప్పదలచు కోలేదు కూడా. తినడానికి ఉపయోగించే కొన్ని ఆకులు కోసి, తన వలలో పడిన 5, 6 చేపలను తీసుకొని, ఇంటికి తిరిగి వెళుతూ, త్రోవలోపడి ఉన్న కొన్ని ఎండిన పక్షులు పెట్టిన పుల్లగూడులు వంటచెరకు నిమిత్తం సేకరించాడు.

ఇంక సోనా పెళ్లి జరిగేందుకు రెండు రోజులు వున్నాయి, అని మనసులో రోజులు లెక్కపెట్టుకున్నాడు, ఎతోవా ! ఆ పక్షుల గూడులను తన సంచిలోకి చేరేసేటప్పుడు సంతోషంతో ఆకాశాన్ని, వాయువుని ఇలా సంబోధించాడు. "మీకేంతెలుసు! నేనిప్పుడు అ, ఆ, ఇ, ఈ - అన్నీ చదవగలను." అతనికి సమాధానం చెపుతున్నట్లుగా ఆకాశం వంగింది, గాలికి గడ్డిమొక్కలు సంతోషంతో ఊగాయి. మర్నాడు సోనా తమ్ముడు వచ్చి, ఎతోవా; పెళ్లి ముందర ఎన్నో పూజలు, ముచ్చట్లు జరుగుతాయి. అవన్నీ వచ్చి చూడవా?"

'సరే ! అని అతనితో వెళ్లాడు ఎతోవా. అక్కడి ఆడవాళ్లు ఒకకొత్త మట్టిపాత్రను గ్రామదేవత గరమ్ గుడి దగ్గరకు తీసుకువెళ్లి, పాటలు పాడుతూ ఆ అమ్మవారికి అంకితం చేస్తారు. తర్వాత సోనా తండ్రి ఆ కుండలో చేపలూ, బియ్యం కలిపి వండి దాన్ని వాళ్ల పితృదేవతలకు హవిస్సుగా అర్పించాడు. చేతిలో పార పట్టుకుని ఆడవాళ్లు పాటలు పాడుతూ మగవాళ్లు డప్పులు వాయిస్తూ నడిచారు. పురాతనపు 'సిధా' చెట్టు క్రిందనుంచి మూడు పారలనిండా మట్టి త్రవ్వి, దాన్ని భజన ఇంటివాకిలి ముందు పోసారు. దాని మీద తర్వాత పెళ్లివేదిక నిర్మించారు. పారతో నేల త్రవ్వేముందు, భూమాతకు అలా త్రవ్వుతున్నందుకు క్షమాపణ చెబుతూ ఆ తల్లిని పూజించారు.

మళ్లీ పాటలు పాడుతూ ఆడవాళ్లు ఒక గుంపుగా డులాంగ్ నది వద్దకు వెళ్లారు. ఒక బాణం వేసి ఆ నీటిలో తత్ఫలితంగా ఏర్పడిన ఎడమలో ఉన్న నీటిని వాళ్లు తమ కుండలతో సేకరించారు. అప్పుడు ఒక కుండలో అన్నం, మిఠాయి, అద్దం, దువ్వెన, గాజులజత పెట్టి ఒక దూత ద్వారా పెళ్లికొడుకు ఇంటికి దాన్ని పంపారు. కొత్తచీర కట్టుకుని సోనా అప్పుడే పెళ్లికూతురులా చక్కగా తయారయింది. ఆమె మెడచుట్టూ ఒక ఎర్రత్రాడు, ముంజేతులకు పచ్చదారం కట్టారు; శరీరమంతా పసుపుతో అలంకరించారు. నిన్న మొన్నటిదాకా చిన్నపిల్లలా గంతులేస్తూ, మేకలను మేపుతూ అడవిలో తిరిగే సోనాయేనా ఇది అని ప్రజలు ఆశ్చర్యపడేలా ఆమెలో కొత్త పెళ్లికూతురి



పోకడలు శోభిల్లాయి.

ఎతోవాని తమతో కలిసి భోజనం చేయమని ఆహ్వానించాడు భజన. "ఇవేళ కాదు, తాతా! నేను వెంటనే మా తాత దగ్గరకు వెళ్లాలి" అన్నాడు ఎతోవా.

*　　　　*　　　　*

ఇంటికి వెళ్లే త్రోవలో ఎతోవాకి మామిడితోటలో మంగళ్ కనుపించాడు. అతను వంటకోసం పుల్లలు ప్రోగుచేసి, చాలా అలసి పోయినట్లు తోచాడు. తన తాత ఎంత ముసలివాడయ్యాడో సరిగ్గా గ్రహించలేదు ఎతోవా.

"ఇంటికి నడు, తాతా! నేను దూడలను మేపి, తోటకు నీళ్లుపెట్టి ఇంటికి వచ్చేటప్పుడు ఈ పుల్లల మూట పట్టుకొస్తాలే!" అన్నాడు.

"నన్నిక్కడ కాస్సేపు కూచోనీ. ఈ పుల్లలమూట తీసికెళ్లి చిల్లర కొట్టు అతనికిచ్చి, అతని దగ్గర కొంత నూనె, ఉప్పు పుచ్చుకో. ఇంటికెళ్లగానే కుంపటిమీద బియ్యం పెట్టి అన్నంవండు."

"నాతో రా."

"మెల్లిగా నీ వెనకాలే వస్తాలే. ఇంతసేపూ భజన వాళ్ల ఇంటిలో ఏమేమి చూసావో నాకు చెప్పు."

"వాళ్ల ఆచారాలు మన ఆచారాలలాగే ఉన్నాయి చాలామట్టుకు."

"నువ్వు సోనాకి ఏం బహుమతి ఇస్తావు?"

"నేనేం ఇవ్వగలను?"

"నేను అల్లిన చాప ఇవ్వచ్చు కదా !"

"అది చాలా అందమైనది. దాని మీద రంగులు కూడా వేసావునువ్వు. అది అమ్మితే మనకు బజారులో 6, 7 రూపాయలే వస్తాయి."

నీరసపు గొంతుతో మంగళ అన్నాడు. "ఉత్తి చేతులతో పెళ్లికి వెళ్లకూడదు. మన ఆదివాసులలో పెళ్లి చేయడం అంటే మన సంఘంలో అందరికి సమానమైన పూచీ ఉంటుంది. ప్రతి అతిథి తనకు చేతనైనంత సాయం చేస్తాడు పెళ్లి ఖర్చులకు."

"పట్టణవాసంలో ఉండే మన వాళ్లేం జేస్తారు ఇటువంటి సందర్భంలో?"

"మా మూలుగా పెళ్లిళ్లకు పల్లెటూళ్లు వచ్చేస్తారు కదా వాళ్లుకూడా? మన పద్ధతులు వాళ్లు పట్టణాలు వెళ్లాక ఎలాగ నిలబెడతారో నాకేం తెలుస్తుంది?"

"చాంద్ మావయ్య అంటాడు మనం పూర్వం ఉండే పల్లెటూళ్లల్లో కూడా మన ఆచారాలు అప్పుడు వేరేగా ఉండేవి, అని"

"అతనికే సరిగ్గా తెలియాలి. అతను చాలా ప్రాంతాల తిరిగి చూసాడు. కాని, కాలం ఎంత మారినా, మనవాళ్లు మన పాతకాలపు ఆచారాలు, పద్ధతులు, పండుగలు, జాత్రలు, సంబరాలు మొదలైనవి, మన జీవితవిధానం, ఎప్పుడూ ఒకలాగే ఉంటాయని నేననుకుంటాను. అంటే ఇప్పుడుకూడా పూర్వంలాగ పూర్తిగా మన అలవాట్లు ఉంటాయని కాదు. పూర్వం సరహుల్‌బాహ్, సుర్‌జోమ్‌బాహ్ పండుగల రోజుల్లో వందలకొలది 'సార్' చెట్లు పూలు పూచేవి; అడవులు, పేట్టుపురుగుల చెట్లు రంగురంగుల వెలుగులు వెదజల్లుతూ ఉండేవి. ఆడవాళ్లు, మగవాళ్లు అడవుల్లో రాత్రి తెల్లవార్లు ఒళ్లుమరచి నాట్యమాడేవారు. అల్లాంటి రోజులు మళ్లీచూడలేం. ఇప్పుడు అన్ని చెట్లూలేవు, అటువంటి మనుష్యులూ లేరు."

"మా పంతులంటాడు-స్వతంత్ర దినోత్సవంనాటికి మనం ఎన్నో కొత్తచెట్లు నాటి పెంచుదామని"

"మంచి కబురు చెప్పావు. సరే. ఇంక చిల్లర కొట్టుకు వెళ్లు"

"ఎంత పెద్ద పుల్లలకట్ట సంపాదించావో, తాతా!"

"అదంతా ఆ చచ్చిపోయిన మామిడిచెట్టు వల్లనే."

"దానికింద మట్టుకు కూర్చోకు. ఏదైనా కొమ్మరాలి నీమీద పడొచ్చు!"

"మరేం భయంలేదు. ఆ చెట్టూ, నేనూ మంచి స్నేహితులం!"

"చెట్టు నీకు స్నేహితుడెలా అవుతుంది!"

"అది నా స్నేహితుడే! నా కిక్కడ చెట్లన్నీ పూర్తిగా తెలుసును. ఈ మామిడి చెట్లకన్నింటికి పెళ్లిళ్లయ్యాయి తెలుసునా?

"పెళ్లిళ్లా?"

"లోధాజాతి వాళ్ల పెళ్లికొడుకుకి, తన పెళ్లికూతురుతో పెళ్లి అయ్యే ముందు, మామిడి చెట్టుతో పెళ్లి చేస్తారు. అల్లాగే పెళ్లికూతురికి, పెళ్లి ముందు, 'మహువా' చెట్టుతో పెళ్లిచేస్తారు"

"ఏం వింత ఆచారాలు!"

"అందులో ఏమీ వింతలేదు. చెట్టులాగ గట్టిగా, నిక్కచ్చిగా, ఉపయోగకరంగా, సొంత

లాభం మానుకుని పరాయి వాళ్లకి పనికొచ్చేలాగా మనం ఉండాలని అందులో భావం."

ఎతోవా పుల్లల కట్టను ఎలాగో చిల్లరకొట్టు దగ్గరకు చేరేసాడు. నూనె, ఉప్పు తెచ్చి చేపలకూర చేసి అంతక్రితం రోజున సేకరించిన దుంపలు దానితో కలిపి వంట చేసాడు. మంగళ్ రోజూ కాస్త బియ్యం సంపాదించి ఇంటికి తీసుకొస్తాడు. అది మోతీబాయి సాలీనా తనకిచ్చే జీతంలో తగ్గించుకుని అతనికిస్తూ ఉంటాడు. తర్వాత నీళ్లతోడి తేవడం, వాకిలి తుడవడం ఉంటాయి. పాపం, ముసలివాడు ఇంతపని ఎలా ఒక్కడూ చేయగలదు?"

తన తల్లితండ్రులు లేని లోటు ఎతోవాకి అనిపిస్తుందా! నిజానికి వాళ్లిద్దరూ కూడా తనకు జ్ఞానం వచ్చేముందే చనిపోయారు. అతనికి తన తాతే తన సర్వస్వమూ. తన తల్లి బాగా పాడేదని అతనికి తెలుసు. ఎతోవా కూడా బాగా పాడగలడు. ఎప్పుడో ఒకరోజున ముందా జాతి వాళ్లు ప్రదర్శించే వీధినాటకంలో అతను రాజుగారి వేషంవేసి, తప కర్రకత్తిని ఉపయోగించి దుర్మార్గులను శిక్షించబోతాడు తను అని అతనికి తెలుసు.

కోతలు కోసాక, పంటలు బాగా పండితే ఆదివాసులు ఇటువంటి 'జాత్ర' వినోదాలు వీధినాటకాలు ప్రదర్శిస్తారు.

హాథీఘర్‌లోని 'ఆదివాసిక్లబ్బు' తన ప్రత్యేకమైన నాటకం కంపెనీని స్థాపించబోతోంది.

ఇంటి దగ్గర పని పూర్తిచేసి, ఎతోవా వీధితలుపు గొళ్లెం పెట్టి, మోతీబాబు ఇంటికి వెళ్లి అక్కడు కూరలతోటకు నీరు పెట్టాడు. మోతీబాబుకి చాలా సంతోషం కలిగింది. అన్నాడు-"ఎంత త్వరగా నీ పని పూర్తి చేస్తున్నావు ఎతోవా! కన్నుమూసి తెరిచేలోగా



నీసని అంతా చేసేస్తున్నావు. ఇలా ఎప్పుడూ నాకోసం పని చేస్తూ ఇక్కడ ఉండిపోతే నీకు అన్నం బాగాపెట్టి కావలసిన బట్టలన్నీ కుట్టించి ఇస్తాను. ఒక్క నిక్కరు జతే కాదు, చొక్కా, పై కండువా కూడా కొని ఇస్తాను."

"కాని . . . "

"నాకు మంగళ్ మొండిపట్టుదల మనిషి అని తెలుసు. కాని రతన్‌ని సింగరాయినీ చూడు. వాళ్ళు నా తమ్ముడి ఇంట్లో యువరాజుల్లా బ్రతుకుతున్నారు ... "

ఆ మాటలు వినిపించుకోకుండా ఉండేందుకు ప్రయత్నించాడు ఎతోవా !

* * *

మరునాడు చక్కగా ఉతికిన నిక్కరు, షర్టు వేసుకుని, చాపను మోసుకుంటూ పెళ్లికి బయలుదేరాడు ఎతోవా పెళ్లికొడుకు పొరుగూరికి చెందిన ఒక బలమైన యువకుడు. సోనా బంగారపు పిట్టలా మెరుస్తోంది. దాని అన్నమానిక్ 'పెళ్లికొడుకు చాలా ధైర్యవంతుడు, ఒకప్పుడు ఒక ఎలుగుబంటిని చంపాడు, అని చెప్పాడు ఎతోవాతో

"ఎక్కడ?"

"అడవి దగ్గర పల్లెటూరిలో. నేను కూడా అక్కడకు వేటాడేందుకు వెళుతూంటాను."

ఇంతలో అక్కడి ఆడవాళ్లు ఇలా పాడడం మొదలుపెట్టారు.





"పెళ్లికూతురికి పెళ్లి మహువా చెట్టుతో
పెళ్లికొడుకుకి పెళ్లి మామిడి చెట్టుతో
ఓ ఎంత ఆనందదాయకమైంది ఈ పెళ్లి!
మామిడి ఆకుమీద పెళ్లికొడుకు పేరు
మహువా ఆకుమీద పెళ్లికూతురు పేరు
ఓ ఎంత ఆనందదాయకమైంది ఈ పెళ్లి!"

క్రితంరోజున బాణం వేసిన చోటునుంచి తెచ్చిన నీటితో పెళ్లికూతురు స్నానమాడింది. తర్వాత తన అన్నగారి చేయిపట్టుకుని, ఎర్రఅంచు తెల్లచీర కట్టుకుని పెళ్లిపీట దగ్గరకు వచ్చింది. పెళ్లికొడుకు తన వదినతో కలిసి వచ్చాడు. లోధా జాతికి చెందిన పూజారి ఆ యువ జంట చేతులు ఒక దారంతో కలిపికట్టి, మంత్రించిన నీళ్లు వాళ్లపై జల్లాక, త్రాడు విప్పి చేతులు విడదీసాడు. ఎడమ వైపు నుంచి కుడి వైపు, పెళ్లికొడుకు చుట్టూ ప్రదక్షిణం చేయించారు పెళ్లికూతురిని. పెళ్లికూతురిని తన ఇంటికి తీసుకు వెళ్లాక ఆమె పాపిట మధ్యను సిందూరంతో అలంకరిస్తాడు పెళ్లికొడుకు.

గొర్రె మాంసం కూరతో వరి అన్నం కలిపి, పెళ్లి అయాక అందరూ విందు ఆరగించారు. సూర్యాస్తమయం ముందు, సోనాను అత్తవారింటికి తీసుకు వెళ్లేందుకు ఒక రెండెడ్ల బండి సిద్ధపరచబడింది. సోనాకు పుట్టిల్లు విడిచి వెళ్లడం గురించి దుఃఖం పొంగుకు వచ్చింది. అక్క అత్తవారింటికి వెళుతుందని పెళ్లికూతురి కంటె ఎక్కువ



దుఃఖించింది ఆమె చెల్లెలు. గ్రుడ్డి ముసలివాడు భజన అన్నాడు,"నాకందరిలోకి ముద్దు అయిన నా మనవరాలు నా గుండె ఖాళీ చేసి ఇవేళ ఇక్కడినుంచి వెళ్లిపోతోంది."

ఆదివాసులలో కట్నం ఇచ్చి పుచ్చుకునే ఆచారం లేదు. బంగారంలా మెరుస్తున్న పెళ్లికూతురిని పెళ్లి కొడుకు ఇంటికి పంపేటప్పుడు లాంఛనప్రాయంగా మగ పెళ్లివారు ఒక వంద రూపాయలు ఆమె చేతిలో పెట్టారు, అంతే.

*　　　*　　　*

మంగళ్ అన్నాడు, 'ఇప్పుడింక సోనా పెళ్లి హడావుడి అయిపోయింది కాబట్టి, నువ్వు నీ చదువు విషయం ఇంకా శ్రద్ధ చూపించాలి, ఎతోవా! ఈ సాయంత్రం 'ఆదివాసీ క్లబ్బుకి రా. అక్కడ మీటింగు జరుగుతోంది."

"చిన్న పిల్లలు రావచ్చునా మీటింగుకి?"

"ఓ, ఈసారి పిల్లలు కూడా వస్తారు అక్కడికి."

"ఏం, నీ గొంతుకంత నీరసంగా ఉందేం? వంట్లో బాగులేదా?"

"ముసలితనం వచ్చింది కదా! పూర్వపు ఓపిక ఎలా ఉంటుంది?"

"కానీ, నేనీ స్కూలు విడిచి మోహినీపురంలో హాస్టలున్న హైస్కూలుకి వెళ్లేవరకు బ్రతికి ఉండాలి, తాతా! ఒక రోజు నేను బడిపంతులుని అవుతాను. ఇవన్నీ చూసే వరకు నువ్వు బ్రతికి ఉండకపోతే నీతో మాటాడనంతే, అబ్బా!"

"ఆరోజు చూసే అదృష్టం నాకు ఉండాలని బిర్సా భగవానుని వేడుకుంటాను..."

వేసవి సెలవులు వచ్చేసరికి హడావుడి, ఉత్సాహం పెరిగాయి. 1855 - 56 సంవత్సరంలో జరిగిన సంతాలు తిరుగుబాటు యొక్క స్మారక దినోత్సవంగా 'సిద్ధూ కన్హూ' దినం పేరిట జూన్ 30వ తేదీన హాథీఘర్ ఆదివాసి క్లబ్బు ఆటలపోటీలు ఏర్పాటు చేస్తుంది. నవంబరు 15వ తేదీన ముండాల మహానాయకుడైన బిర్సా భగవాన్ జన్మదినోత్సవం జరుపుకుంటారు. మామూలుగా ప్రతి సాయంత్రం క్లబ్బు గదిలో పుస్తకాలు, పత్రికలు చదువుకుంటారు; కొందరు కారమ్సులాంటి ఆటలు ఆడుతారు.

పట్టణంలో బాంకులో పని చేస్తున్న ఆదివాసి జితేన్‌ముర్మూ ఆ క్లబ్బుకి క్రీడారంగానికి చెందిన పత్రికలు, వారపత్రికలు, వివిధమైన పుస్తకాలు పంపుతాడు. పెద్ద కుర్రాళ్లు చిన్న కుర్రాళ్లకు ఆటలు నేర్పుతారు; డ్రిల్లులు, కసరత్తులు మొదలైన వాటిలో కూడా శిక్షణ ఇస్తారు.

ప్రహరాజసింగు ముండా అన్న. ఆయన లాల్‌వారీ గ్రామంలో సీనియర్-స్కూల్ టీచరు. ఆయన వాళ్ల వాళ్లకు ఇచ్చిన ఆదేశం ఇదిః "చదువుకోండి బాగా; క్రీడారంగంలో ఉత్సాహంతో పాల్గొండి; ఈవిధంగా మీకు అనేక ఉద్యోగాలు దొరుకుతాయి."

హాథీఘర్‌లోని ఆదివాసీ క్లబ్బు సాంస్కృతిక కార్యక్రమాలు కూడా నిర్వహిస్తుంది - సంగీతంలోనూ నాట్యంలోనూ పోటీలు; వాళ్ల మాతృ భాషలో ఉపన్యాసాలు, వక్తృత్వపు పోటీలు మొదలైనవి.

కానీ ఈ సంవత్సరం అంతా మారిపోయింది.

ప్రహరాజ్ అన్నాడుః "మన పిల్లలు స్కూళ్లకు ఎక్కువగా వెళ్లక పోవడం, వెళ్లినవాళ్లు బగా చదవకపోవడం, చాలా చింతించవలసిన విషయాలు."

చాంద్ అన్నాడుః "పిల్లలకు తిండి సరిగ్గా పెట్టలేని తల్లితండ్రులు, వాళ్లను బడికెలా పంపగలరు?"

"నాకా సంగతి తెలీదా! కాని, ఎల్లాగో అలాగ పిల్లలను బడికి పంపాలి."

"వాళ్లకక్కడ చెప్పే పాఠాలు అర్థం కాకపోయినానా?"

"ఆ సంగతి గురించే నీకిప్పుడు నేను చెప్పదలచుకున్నది. జితేన్ మనకో పెట్రోమాక్సు లైటు కొని ఇచ్చాడు. మనలో చదువుకున్న పెద్దవాళ్లం రాత్రిపూట

వాళ్లకు ప్రయివేటు పాఠాలు చెప్పాలి. అయితే ఇందుకయే - నూనె, పుస్తకాలు, పలకలు, మొదలైన వాటికి ఖర్చు భరించేందుకు ప్రతి ఇంటికి ఒక్కొక్క రూపాయి చొప్పున చందా వసూలు చేయాలి."

"సరే, చదువుకున్నప్పటికీ వాళ్లకిందులో మంచి భవిష్యత్తు ఏముంది? ఉద్యోగాలు దొరక్కపోతే, మళ్లీ దూళ్లకాపరులలాగే తిరిగి పని చేయాలి వాళ్లు."

"వాళ్లకు ఉద్యోగాలు దొరకవని నువ్వెలా చెప్పగలవు? టీచరు అందించిన సందేశాన్ని మనం పెద్దలం కూడా బాగా ఆలోచించి పాటించేలా చూడాలి. నేనన్నట్లు మన పిల్లలు బడికి వెళ్లాలి, వాళ్లకు మనం రాత్రిళ్లు చదువు విషయంలో సహాయపడాలి."

పెద్దవాడవుతున్న కొలది భైరోసింగు ముందాకు విసుగు, చిరాకు ఎక్కువవుతున్నాయి. అతనిలా అరిచాడు : "నువ్వన్నది బాగుంది కానీ, మన రోడ్ల మాటేమిటి? మనకు సరియైన రోడ్లు లేకపోవడం మూలాన, మన పల్లెటూళ్లకు బస్సు సౌకర్యం లేదు. మన వ్యవసాయం కూడా అలాగే ఏడుస్తోంది. సరియైన నీటి సరఫరా లేక మనకు రెండవ పంట పండించేందుకు అవకాశం లేదు."

"మన పిల్లలను బడికి పంపడం, మన కనీసపు అవసరాల గురించి సర్కారు వారికి తెలియజేయడం, రెండూ కలిసి చేయవచ్చు కదా! అడిగితే కాని అమ్మయినా అన్నం పెట్టదన్నట్లు, మనం మన కోరికలు ప్రభుత్వానికి తెలియజేయాలి. అలా చేసేందుకు మనకు కావలిసిన ధైర్యం, శక్తి, ముందు చదువు ఉంటేనే మనకు కలుగుతాయి."

ఇంతలో మంగళ్‌ముందా కలుగజేసుకుని భైరోసింగుకి, గురాసింగు కథ జ్ఞాపకం చేసాడు. ప్రహరాజ్ కూడా అమాటే నొక్కిచెప్పాడు. "కాళీ తెల్ల కాగితం మీద వేలి ముద్ర వేయకూడదనీ తాగుడు తగ్గించాలని, అందుకు చదువు అవసరం అని, మనకు గురాసింగుకథ చెప్పకచెపుతుంది."

"బాగుంది. ఇంకేమిటి చెప్పదలచుకున్నావు?" అని భైరో గదిమాడు."

"విను మనం అడవులను నాశనం చేస్తున్నామని మనతో చెపుతుంటారు. కాని అందుకు నిజమైన పూచి ఎవరిదో మనకు తెలుసు. ఈ ఏడాది మన మట్టుకు మనం క్లబ్బు, స్కూలు, ఇళ్ల చుట్టూ మొక్కలు పాతుదాం."

"విత్తనాలు, మొక్కలు ఎవ్వరిస్తారు?"

"ప్రభుత్వం."

"క్లబ్బులో రాత్రిబడి ఎప్పుడు మొదలు పెడతావు?"

"రేపే ఎందుకు ప్రారంభించకూడదు? చదువుతో పాటు, పిల్లలకు పాటలు పాడడం, వేణువు ఊదడం మొదలైన కళలు గూడా నేర్పుదాము. ఎతోవా, రతన్, సింగ్‌రాయి ముగ్గురు కూడా బగా పాడుతారు. దూళ్లను మేపుతున్నప్పుడు వాళ్లు పాడుతుంటే విన్నాను. ఈ మంగళ్ మావయ్యను చూడు. ఇంత ముసలితనంలో కూడా పనుల పూచీ తను పెట్టుకుని మనవడు బడికి వెళ్లే అవకాశం ఎలా కల్పిస్తున్నాడో! నీలాంటి యువకులు అతణ్ని చూసి అలాంటి మంచి అలవాట్లు నేర్చుకోగూడదా?"

"సరే, కొత్త బడిపంతులు ఏదో న్యాయంగానే మాటాడుతున్నట్లు తోస్తోంది. అతను ఇచ్చిన ఆదేశం ప్రకారం మనం పెద్దలం పిల్లలకు ఎలా సాయపడగలమో చూద్దాం."

"అవును. లోధా వాళ్లల్లో ఒక అమ్మాయి కూడా బి.ఎ., పాసయింది. మావా, నువ్వు ప్రయత్నిస్తే మనవాళ్లు చదువు విషయంలో ముందుకు వచ్చేలా తప్పక చేయగలవు."

ఎతోవా కు చాలా సంతోషం కలిగింది. ఇంతవరకు పెద్దవాళ్లకే ఉపయోగించుకునే వీలున్న క్లబ్బులో ఇప్పుడు పిల్లలకు కూడా ప్రవేశం ఉంటుంది.

మర్నాడు దూళ్లను మేపుతూ, మరింత గొంతెత్తి పాటలు పాడాడు ఎతోవా! డులాంగు నదీ జలాలను ఉద్దేశిస్తూ ఇలా పలికాడు:

"నువ్వు చూస్తావు కదా! నువ్వు చూస్తావిప్పుడు! అంతా మారి పోతుంది! మా పంతులు బలే గొప్పవాడు, నీకా సంగతి తెలుసా?"

ఆదివాసుల పిల్లలకు స్కూలులో కొన్ని సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. ఎప్పుడూ ఆరుబైట, తోటల్లో, నది ఒడ్డున, స్వేచ్ఛగా తిరిగే అలవాటు ఉన్న వాళ్లకు స్కూలు నాలుగు గోడల మధ్య ఊపిరి ఆడనట్లు అనిపిస్తుంది. వాళ్ల ఉపాధ్యాయుడు కూడా ఆదివాసి అయితే మట్టుకు వాళ్లకు కొంతమెరుగే. అతని మాటలు వాళ్లకు అర్థం అవుతాయి, వాళ్ల సమస్యలను అతను అవగాహన చేసుకుంటాడు. ఈ ప్రాంతంలో చాలామందికి బెంగాలీ తెలిసినప్పటికి, మొదటిసారిగా పల్లెటూరినుంచి వచ్చిన పేదపిల్లలకు పట్టణవాసపు వాళ్లు మాటాడే ఆ భాష బాగా అర్థంకాదు. కాని మోతీబాబు

మాటాడే భాష వాళ్లకు, అతను ఆ ఊరివాడే కాబట్టి, కష్టం లేకుండా తెలుస్తుంది.

హఠాత్తుగా ఎతోవాకి ఒక బంగారపు రంగుల నాలు తొండ కనుపించింది. "పరుగెత్తిపోయి, దాంకో!" అన్నాడు దానితో ఎతోవా.

లోధాలు దుర్గాపూజ రెండవ రోజున ఈ బంగారపు రంగు నేల తొండ కోసం వెతుకుతారు. వాళ్ల పూర్వగాధ ప్రకారం, వాళ్ల రాజైన 'కాలకేతు' అడవి దేవత 'అరణ్యచండిక'ను పూజించేందుకు తప్పనిసరి అయిన ఒక వింత నీలం పువ్వును తెచ్చేందుకు అరణ్యంలోకి వెళ్లి, ఆ పువ్వు దొరక్కపోతే, దానిబదులు ఒక బంగారపు రంగు తొండను తీగలతో కట్టి ఇంటికి తెచ్చాడట. ఇల్లు చేరుకునే సరికి అది ఒక అరణ్యదేవతగా మారి ఆ 'కాలకేతు' ను రాజ్యం స్థాపించేందుకు సమర్థుణ్ని చేసిందట. కాని కొంతకాలం పోయాక బైటవాళ్లు అతణ్ణి ఓడించి అతని రాజ్యాన్ని స్వాధీన పరచుకున్నారట. అప్పటినుంచి, సహజంగా వేటగాళ్లయి లోధాలు, దుర్గాపూజ రెండవ రోజున బంగారపు రంగునేల తొండను వేటాడి చంపితే వాళ్లందరూ వాళ్ల పూర్వపు రాజు కాలకేతు అంత సాహసవంతులు, వీరులు అవుతారని వాళ్ల నమ్మకం...

కొన్ని దుంపలు, ఆకుకూరలు సేకరించాక తన అభిమానమైన గేదెపై సవారీ చేయడం మొదలు పెట్టాడు ఎతోవా. అతడికి సిధ్ధూ గురించి కానీ, కన్హూ గురించి కాని, బిర్సా భగవాన్ గురించి కాని బాగా తెలియదు. కాని ఆకాశంపైకి చూసి అరిచాడు: "నాకు పుస్తకాలు చదవడం చేతయ్యాక, వాళ్ల గురించి పూర్తిగా తెలుసుకుంటాను."

* * *

తన సంతోషానికి అది ఆఖరి రోజు అని ఎతోవా తెలుసుకోలేక పోయాడు. తను బాగా చదువుకుని గొప్పవాడను అవుతానన్న ఉత్సాహం త్వరలోనే సమసి పోతుందని అతనికేం తెలుసు, పాపం! గేదెపై పడుకుని, పాటలు పాడుకుంటూ, కలలు కంటూ ఇంటికి వస్తున్న అతనికి పరిగెత్తుకుంటూ వస్తున్న ప్రజల కోలాహలం, అరుపులు హఠాత్తుగా వినిపించాయి. "ఎతోవా! ఎక్కడున్నావు? మీ తాత మంగళ్ మీద చెట్టు పడింది, అతను నలిగిపోయాడు."

"అయ్యో!" అని రోదిస్తూ చాంద్, భైరో మొదలైన వాళ్లు ఉన్న చోటికి పరుగెత్తాడు ఎతోవా. వాళ్లెందుకు అంత దీనంగా, పేలవంగా కనుపిస్తున్నారు?

"నాయనా, వెంటనే మోతీబాబుగారి మామిడి తోటకు వెళ్లు."





నవంబరు 15వ తేదీన బిర్సా జయంతి. అంత్యక్రితం రోజున మరునాడు పనిలోకి రానని మోతీబాబుతో చెప్పాడు ఎతోవా.

"ఏం?"

"రేపు బిర్సా జయంతి."

"అయితే ఏం? అది ప్రతి ఏటా వస్తుంది."

"ఈ ఏడాది ఎక్కువ మంది హాజరవుతారు. మేం క్లబ్బు అంతా ఘనంగా అలంకరించాలి."

"నాకు నవ్వు తెప్పించకు, ఎతోవా! మీరేదో మొనగాళ్లం అయిపోయాం అనుకుంటున్నారు. రోజులు బాగులేవు కాబట్టి, మేం ఊరుకుంటున్నాం కాని, మీ వ్యవహారం మరీ శృతిమించుతోంది. బిర్సా జయంతా! చాలా పెద్ద సభ జరుగుతుందా! నోటమ్మట సరిగ్గా మాటాడలేని మీ అడవి మనుషులు ఏవో పెద్ద కబుర్లు చెప్పడం నేర్చుకున్నారే!"

ఎతోవాకి ఒళ్లు మండింది. కాని మోతీబాబు అంటే చాలాకాలం నుంచి పాతుకుపోయిన భయం మూలాన, ఏమీ జవాబు చెప్పలేదు. మాటాడకుండా ఇంటికి తిరిగి వచ్చాడు.

"తాతా, నోటమ్మట సరిగ్గా మాటాడలేని అడవిజాతివాళ్లమా మనం?"

"ఎవరన్నారు ఆ మాట?"

కాని తరుచు రోగులను గాయపడినవారిని, పట్టణం తీసుకువెళ్లి ఆసుపత్రిలో వైద్యం చేయించే అనుభవం ఉన్న ప్రహరాజ్ సింగ్ అన్నాడు. "ఇది శశిలో దాకు లొంగే గాయం కాదు. మోతీబాబుగారి దగ్గరకు వెళ్లి రబ్బరు టైరులున్న ఒక ఎడ్ల బండి అడిగి తీసుకురండి".

. "ఆ బాబు ఇస్తాడంటావా?"

"ఇచ్చి తీరాలి. మంగ ళమావ ఆయన పని చేస్తున్నప్పుడే అతనికి ప్రమాదం జరిగింది." మంగళ హీనస్వరంతో అడ్డుపెట్టాడు. "నేనెప్పుడూ ఆసుపత్రికి వెళ్లలేదు నా జన్మలో".

"మావా, ప్రతీ దానికి ఒక మొదలంటూ ఉంటుంది. ఇంత వరకూ జరిగిందేదో జరిగింది. ఈసారి మట్టుకు నీకు మోహినీపురంలోని 'ఆరోగ్యకేంద్రం'లో తప్ప వేరే చికిత్స లాభం లేదు."

"మన శశిగాడు ఆవులవీ, మేకలవీ విరిగిన ఎముకలు అతకగలుగుతున్నాడు కదా!"

"కానీ నువ్వు ఆవూ కాదు, మేకా కాదు. పైగా నువ్వు ఎతోవా గురించి ఆలోచించాలి"....

కోపంగా చాంద్ అరిచాడు, "మోతీబాబుగారి ఈ చెట్టు కొట్టి పారేయాలి. లేకపోతే ఎప్పుడెవరి మీద పడి చంపేస్తుందో ఏం చెప్పగలం?"

చెట్టులో దాగి ఉన్న దెయ్యాల గురించి ఆలోమణి ఏదో చెప్పబోయిందికాని, మగవాళ్లు ఆవిడను ఆమాట ఎత్తనద్దని అడ్డుచెప్పారు.

మొదట కొంచెం ఇష్టం లేనట్లు కనుపించినా, చివరికి మోతీబాబు తన బండిని ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. ఒక మాట మట్టుకు అనకుండా ఉండలేకపోయాడు- "తాత బదులు ఎతోవా పనిలోకి వచ్చిఉన్నట్లయితే ఆ ప్రమాదం జరగక పోను; అదంతా మంగళ యొక్క మొండితనం మూలానే" అని.

కొంచెం డబ్బు కూడా ఇచ్చాడు మోతీబాబు. అతని అభిప్రాయం ఏమిటంటే నీటిలో బ్రతుకుతూ ఉన్నవాళ్లు అందులో ఉన్న మొసళ్లతో మంచిగానే ఉండాలని. అతని చుట్టూ ఉన్నవాళ్లు ఆదివాసులు. వాళ్లకేదైనా కోపం వచ్చిందంటే ఆ చుట్టుప్రక్కల ఉన్న తోటి ఆదివాసులకు 'సాల్' చెట్టులోంచి తీసి, ముడివేసిన బెరడు పంపుతూ వాళ్ల ప్రత్యేకపు సహాయం కోరవచ్చు. ఆదివాసులలో ఒకళ్లకొకళ్లు వార్తలు పంపించుకోడానికి సంబంధించిన విషయం ఇది 'సాల్' చెట్టు లోపలి బెరడు లాగి దాన్ని ముళ్లు వేసి నాలుగు ప్రక్కల ఊళ్లకు వేరేవేరే ఒక మనిషి ద్వారా దాన్ని పంపుతారు. మూడు ముళ్లు వేస్తే జరగబోయే సంఘటన మూడురోజుల తర్వాత జరుగుతుందని. ఆ అందుకున్న ఊరివాళ్లు మళ్లీ వాళ్ల ప్రక్క ఊరివాళ్లకు ఇలాగే వార్తలు పంపుతారు. ఈ విధంగా ఏదైనా క్లిష్టపరిస్థితి వచ్చినప్పుడు ఆదివాసులందరికీ అతి త్వరితంగా ఆ వార్త



అందుతుంది. అప్పుడు వాళ్లందరూ కలిసి విల్లమ్ములతో వచ్చి తన ఎస్టేటుపై దాడి చేస్తారు. పైగా ఈమధ్య ఆదివాసులు తమ కష్టనష్టాల గురించి తమంతటతాము చెప్పవలసిన చోట ధైర్యంగా మొరపెట్టడం నేర్చుకున్నారు. అందుచేత మోతీబాబు ఇప్పుడు వాళ్లతో ఏ విధమైన పేచీ పెట్టుకునేందుకు శంకిస్తున్నాడు...

మంగళకు ముఖ్యమైన బెంగ ఎతోవా గురించి. ఆలోమణి అతనికి ధైర్యం చెప్పింది. "నీ మనవడినీ, నీమేకల్నీ మేం జాగ్రత్తగా చూస్తాంలే. రోజూ సాయంత్రం నీ ఇంట్లో దీపం కూడా వెలిగిస్తాం. నీకెందుకింక బెంగ?"

"మా వాడు ఒక్కడే పడుకోవాలి".

"మేం అందరం చుట్టూ ఉండమా?"....

వాళ్లతో పట్టణానికి కూడా వెళుతూ ఎతోవా ఒక మాటైనా పలకలేదు. ప్రహరాజ్‌కి అక్కడ చాలా మంది తెలుసును. మంగళని ఆసుపత్రిలో చేర్పించి, డాక్టరుతో మాటాడి మర్నాడే ఎక్సరే తీయించే ఏర్పాటు చేసాడు.

రాత్రి ప్రభుత్వపు విద్యాశాఖలో బంట్రోతుగా పని చేస్తున్న శంకర్‌సింగ్‌ముందా ఇంట్లో నిద్రపోయారు మిగతావాళ్లందరూ. భోజనం మట్టుకు రోడ్డు ప్రక్కన ఉన్న ఒక హోటలులో చేసారు. అక్కడ పట్టణ పద్ధతి ప్రకారం వాళ్లకు అంతంతగానే అన్నం వడ్డించారు. మారు వడ్డన కూడా తగినంతగా జరగలేదనిపించింది ఎతోవా కి.

మర్నాడు ఎక్స్‌రే ద్వారా మంగళకి కాలు ఎముకలు తీవ్రంగా విరిగాయని తేలింది. కాలిని ఒక నెల్లాళ్లు ప్లాస్టరులో వేసి ఉంచాలి. నెల్లాళ్ల తర్వాతైనా తిరిగి అతను పనిలోకి వెళ్లగలడా అని అడిగితే నిక్కచ్చిగా చెప్పలేమన్నాడు డాక్టరు 'మేమేమైనా దేవుళ్లమా' అని అడిగాడు ఆయన.

మంగళ అన్నాడు, "నేను తిరిగి బలంగా ఇంటికి వస్తాను, ఎతోవా! నువ్వు మట్టుకు బడికి తప్పకుండా వెళ్లు."

తిరిగి ఇంటికి వెళ్లేటప్పుడు కూడా ఎతోవా నిశ్శబ్దంగానే ఉన్నాడు. స్కూల్ అంటే ఒక కల అనిపించింది అతనికి. మామిడికొమ్మ మంగళ కాలునే కాదు, ఎతోవా సర్వస్వాన్ని కూడా శిథిలం చేసింది. మార్గమధ్యంలో ఎతోవాకి మిఠాయి మామిడిపండ్లు అలాంటివి కొనిపెట్టాడు ప్రహరాజ్. తిరిగి ఎడ్లబండిలో వాళ్ల ఊరు చేరుకున్నారు.

* * *

మంగళ ఒక నెల్లాళ్లు ఆసుపత్రిలో ఉండిపోవాలని పట్టణాన్నుంచి కబురు తీసుకు వచ్చాడు ప్రహరాజ్. ముసలివాడి ఎముకలు అతుక్కునేందుకు ఎక్కువ కాలం పట్టుతుంది కదా!

ఇప్పుడింక మోతీబాబు వలలో చిక్కుకోక తప్పదు 'ఎతోవా' కి. చాంద్, ఆలోమణి, భైరో ముగ్గురూకూడా ఆయన ఇస్తానన్న పనికి ఒప్పుకోవలసి ఉంటుందని నచ్చజెప్పారు 'ఎతోవా' కి – "కొన్నాళ్లు అవసరం తీరే వరకైనా అక్కడ పని చెయ్యి. ఆయన సాయాన్ని కాదంటే తెలివితక్కువ అవుతుంది. రోజు గడవాలి కదా. మీ తాత నువ్వు బడికి వెళ్లాలి అన్నాడనుకో అతను తిరిగిరానీ. అప్పుడు నువ్వు బడికి వెళ్లవచ్చు".

ఈ కొద్ది రోజులలో 'ఎతోవా' జీవితం గురించి ఎంతో అనుభవం సంపాదించాడు. తమకు ఒక చిన్న గుడిసె, కాస్తంత వాకిలి, కొన్ని మేకలు – అంతే ఆస్తి ఉందని తెలుసుకున్నాడు. మోతీబాబు దగ్గర పనిచేస్తే, కనీసం వాళ్ల వాళ్ల మధ్య ఆ ఊళ్లో బ్రతకవచ్చు.

మోతీబాబుకి 'ఎతోవా'నిర్ణయం బాగా నచ్చింది–"నువ్వు ఇప్పుడు బుర్ర ఉపయోగించి పని చేస్తున్నావు. దేవుడికి నువు స్కూలుకి వెళ్లడమే ఉద్దేశం అయి ఉన్నట్లయితే, మీతాత కాలు విరిగి ఉండకపోను".

'ఎతోవా' జవాబు చెప్పలేదు. పగటి పని అంతా అయాక, రాత్రి అతనూ, రతన్ కలిసి చదువుకోవడానికి ప్రయత్నించారు కాని, వాళ్లు చదివినదేమీ వాళ్ల బుర్రకెక్కలేదు. ఇంటిలో కాకుండా 'రాత్రిబడి'కి క్లబ్బుకి వెళదామంటే ఇక్కడ మేకల కాపలా ఎవరు కాస్తారు?

సెలవుల తర్వాత బడి తెరిచాక, క్లాసులో ఎతోవా లేడని కనిపెట్టాడు ఉపాధ్యాయుడు. జరిగిన సంగతంతా ఆయనకు మిగతా విద్యార్థులు విన్నవించారు. టీచరు అన్నాడు; "ఒక్కడూ ఎలా కాలక్షేపం చేసుకుంటున్నాడో నేను వెళ్లి చూస్తాను."

కాని ఎతోవా ఆయన ఏమంటాడో అని, ఆయన వచ్చే సరికి ఎక్కడో దాక్కుని

ఉండిపోయేవాడు. పైగా ఏడుపు వస్తుందేమో అని కూడా భయపడ్డాడు. మంగళ తిరిగి వచ్చి, బడికి వెళ్లని కారణంగా ఎతోవా ను లెంపకాయ కొట్టినప్పుడు మాత్రం అతనికి ఏడవక తప్పలేదు- "నేను చచ్చిపోతే బాగుండేది. అయితే నువ్వు మళ్ళీ పశువుల కాపరివి అయిపోయావన్నమాట. బాబూల బానిసవి కాకుండా, చదువురాని వ్యవసాయపు కూలీవి కాకుండా, నిన్ను రక్షించుదామని నేనెంతో ప్రయత్నించాను. ఈ పనస చెట్టు, అమ్మలేక పోయావా, నీకు రోజు గడవదంటే? లేకపోతే మేకలనమ్మలేక పోయావా? ఆఖరికి నీ పరువు నిలబెట్టుకునేందుకు పస్తు అయినా ఉండలేక పోయావా? ఓ, నువ్వు నాకు ఎంత అన్యాయం చేసావు ఎతోవా?"

"తాతా, మోతీబాబు నువ్వొచ్చేవరకు ఎదురుచూస్తూ ఉండేవాడనుకున్నావా? నన్ను కాకపోతే మరొకర్ని ఎవరినైనా పనిలో పెట్టుకుని ఉండేవాడు. ఏది ఏమైనా, నువ్వు పూర్వంలాగ ఇంక పని చేయలేవు కదా?"

"ఎందుకు చేయలేను?"

"కర్రసాయం లేనిదే నడవలేనివాడివి, బరువు పని ఏం చేయగలవు?" ఆలోమణి అంది". సరిగ్గా ఆలోచించు, మంగళ అన్నయ్యా! ఒక రోజున ఎతోవా బడికి వెళతాడు తప్పకుండా. ఎప్పుడూ రోజులిల్లాగే ఉంటాయా?"

మంగళ మాటాడలేదు. మరునాడు బైటకువెళ్లి ఈత ఆకులు కొట్టుకు వచ్చాడు. ఊరికే ఎలా కూర్చోగలడు? ఈత చాపలు అల్లడం మొదలు పెట్టాడు. ఆదివాసి ఎవ్వడూ కూడా పనిచేయకుండా ఇంటిలో కూర్చోలేడు.

* * *

స్కూలుకు వెళ్లకపోయినా, మోతీబాబు ఇంటికి వెళ్లేందుకు, స్కూలులో మాస్టరు కథలు చెప్పే సమయంలోనే బయలుదేరి అక్కడ త్రోవలో ఆగి కొంతసేపు అవి వినేవాడు. ఎతోవాకి తెలుసును పంతులు పట్టణం నుంచి క్రొత్త కథల పుస్తకాలు తెచ్చాడని. మాస్టరు వెనుక మాట ఇచ్చినట్లు, యుద్ధాల, సమరాల కథల పుస్తకాలు తెచ్చి చదువుతున్నాడు.

అవును ఒకప్పుడు ఒక ఘోర యుద్ధం జరిగింది. ఒక్కొక్క సమయంలో రెండువైపులా బాణాలతో పోరాటం జరిగేది. మరొక్కప్పుడు తుపాకులు, ఫిరంగులతో బాణాలు యుద్ధం చేసేవి. ఇల్లాంటి కథలు తనుకూడా వెళ్లి ఎవరికైనా చెప్పాలని ఉండేది ఎతోవాకి. ఎవరూ దొరక్కపోతే, ఆకాశానికి, పసరుకి, నదికి ఆ కథలు పిలిచి చెప్పేవాడు. అన్నిచోట్ల ఏవో యుద్ధాలు జరుగుతూనే ఉంటాయని గ్రహించాడు ఎతోవా. ఆఖరికి ఆ ముసలి చెవులపిల్లి కూడా తన ఆత్మ సంరక్షణ కోసం పోరాడడం లేదా? మనిషిది కాని, జంతువుది కానీ నీడ తన దగ్గర పడినప్పుడు, చెవులు

నిక్కబెట్టికొని, విని, వెంటనే తన అడవి దుబ్బులోకి మాయమైపోతుంది. తను నదిలో వల వేసినప్పుడు ఎతోవా చూస్తూంటాడు- చేపలు అందులో పడకుండా తప్పించుకునేందుకు ఎలా సంఘర్షణ పడతాయో. అడవి పువ్వులు కూడా ఏదో పోరాటానికి సిద్ధపడుతున్నట్లు ప్రవర్తిస్తాయి- వర్షాకాలంలో సువర్ణరేఖా నది యొక్క మట్టి నీళ్ల క్రింద దాగుకుని, వరదనీరు తగ్గినప్పుడు మళ్లీ తల ఎత్తుతుంది. అందుచేత చరాచర జగత్తు అంతా తన మనుగడ కోసం ఏదో విధమైన యుద్ధానికి ఎదుర్కొనేందుకు ఎల్లప్పుడూ, ఎక్కడో సిద్ధపడుతూనే ఉంటుంది.

ఒకరోజు స్కూలు టీచరు అతణ్ని కనుగొని అపుజేసాడు; "నన్ను చూసి పారిపోకు. బడికెందుకు రావడం లేదో చెప్పు ఎతోవా?"

"నాకు మోతీబాబుగారింట్లో బోలెడంత పని ఉంది."

"నువ్వు బడికి వస్తే నీకు ప్రభుత్వం వారు స్టైపెండు ఇస్తారని, మధ్యాహ్నం టిఫిను కూడా పెడతారని, నీకు తెలుసునా?"

తనకాలి బొటన వ్రేలితో నేలమీద బొమ్మలు గీస్తూ సిగ్గుతో నిలబడిపోయాడు ఎతోవా. చివరికి ధైర్యం తెచ్చుకుని ఇలా అడిగాడు; "మీరు రోజూ ఏదో గొప్ప పోరాటం గురించి చెపుతూంటారు. ఆ ఘోరయుద్ధాలు అయిపోయాయా, ఇంకా జరుగుతున్నాయా?"

ఎతోవా తలమీద చేయిపెట్టి, జుట్టు నెమురుతూ, ఇలా అన్నాడు టీచరు; "చాలా యుద్ధాలు జరిగేవి, ఎతోవా!"

"అవి అన్నీ అయిపోయాయా?"

"ఏం, ఇంకా ఏదైనా ఉంటే అందులో నువ్వు పాల్గొంటావా?"

"నేనా, నేనా..... వినండి, మేష్టారూ. మీ వంట మీరే చేసుకుంటారు కదా? నేను మీకో పెద్ద ముల్లంగి దుంపపట్టుకొచ్చి ఇస్తే తీసుకుంటారా? అది చాలా రుచిగా ఉంటుంది.

"దానికేంగాని, నువ్వు ముందు బడికిరా".

"మా తాత కూడా నన్ను బడికి వెళ్లమని పట్టుపడతాడు. కాని అతని కాలు విరిగింది. అతడి బదులు మరొకడికి ఆ ఉద్యోగం ఇచ్చేస్తానని బెదిరించాడు మోతీబాబు. ఆ పని లేకపోతే మాకు తిండి ఉండదని మా తాత బదులు నేను అతని పనిలో చేరాను."

"నీ స్నేహితులందరికీ కూడా ఇటువంటి సమస్యేనా?"

"అవునండి."

"సాయంత్రం క్లబ్బుకు వచ్చి రాత్రి బడిలో చదువుకోవచ్చు కదా?"

"పగలంతా పనిచేసి అలసిపోతాను, అయ్యగారూ!" అని తల ఆడించి పరిగెత్తుకుపోయాడు. బడిపంతులు అతని కేసే చూస్తూ నిలబడిపోయాడు కొంతసేపు. అవును, ఎతోవా కూడా ఒక మహా యోధుడే. అతను కూడా ఒక గొప్ప పోరాటం పోరాడుతున్నాడు ఎటొచ్చీ అతడి కాసంగతి తెలియదు.

ఆలోమణి రోజూ టీచరుకి త్రాగే మంచినీళ్లు తెచ్చి ఇస్తుంది. ఆమెతో ఆయన అన్నాడు; "ఆదివాసి పిల్లలు బడికి రావడంలేదు. తగుమంది పిల్లలు లేకపోతే సర్కారువారు బడి మూసేస్తారు. నిజానికి చదువుకునే పిల్లలు లేకపోతే బడి ఎలా నిలబడుతుంది?"

"నాయనా, ఇవన్నీ నాకెందుకు చెపుతావు, నాకేమైనా ఇలాంటి విషయాలు అర్థం అవుతాయా! నా కొడుకులు దూళ్లకాపరులుగా చేరి చివరకు పాలం కూలీలగా ఉండిపోయారు. అయినా, క్లబ్బులో 'బిర్సాముండా జయంతి' జరుపుకునే రోజున మా వాళ్లకు మీ బడిమాట చెప్పు".

"అందరూ క్లబ్బుకి వస్తారంటావా?"

"వస్తారు. అంత పెద్ద క్లబ్బు ఏర్పాటు చేసిన సభకు వాళ్లు వచ్చి తీరుతారు."

* * *

మర్నాడు స్కూలు ప్రక్కనుంచి వెళుతున్న ఎతోవాని చూసి, బడిలోంచి బెటకు వచ్చి, అతణ్ని ఆపి ఇలా అన్నాడు బడిపంతులు; "ఇలా లోపలికి రా, ఎతోవా? ఈ బొమ్మ కేసి చూడు."

"ఎవరి బొమ్మ అది?"

"బిర్సాభగవాన్ అని అంటాం, ఆ బిర్సాముండా చిత్రం ఇది. ఆయన గురించి విన్నావు కదా?"

"విన్నానండి".

"ఆయన గురించి నీకేమైనా తెలుసునా?"

"తెలియదండి".

"సిద్ధు, కన్హు అన్న వాళ్ల పేరులు విన్నావా?"

"ఓ, విన్నానండి."

"వాళ్ల గురించైనా తెలుసునా?"

"తెలియదండి."

"ఎతోవా! నీకు యుద్ధాల కథలంటే ఇష్టం కదా! బిర్సా, సిద్ధు, కన్హు - వాళ్లందరూ గొప్ప యుద్ధవీరులు. పోరాడుతూ తమ జీవితాలను బలి చేసుకున్నారు. నువ్వు

చదువుకోవడం నేర్చుకున్నట్లయితే, వాళ్ల గురించి చదివి ఉందువు. అలాగే నీ స్నేహితులకు కూడా వాళ్ల చరిత్ర తెలిసి ఉండేది."

ఒకరోజు ఎతోవా నది దాటి ఆవతలి ఇసుక తిన్నెపైకి వెళ్లాడు. దాని మీద నాట్యం చేస్తూ, ఆకాశం వైపు చేతులు ఎత్తి, నదిని, దుబ్బుటడవిని, ఎగిరే పక్షులనూ ఉద్దేశించి అన్నాడు; "వినండి. అది చాలా గొప్ప పోరాటం మా వాళ్లు దానిలో పోరాడారు. మా బిర్సా, సిద్ధు, కన్హుల గురించి మీకు తెలుసా? వింటున్నారా నా మాటలు?"

డులాంగు నదిలో కెరటాలు ఎతోవా మాటలను సువర్ణ రేఖానది దగ్గరకు చేరదీసి నట్లయింది. ఆకాశపుటంచులలో దూరాన ఉన్న రామేశ్వర దేవాలయం ఆ మాటలు వినేందుకు తల వంచినట్లు తోచింది. ఆ చిన్న గడ్డిమిడుతలు పుష్పంనుంచి పుష్పం మీదకు వ్రాలుతు 'ఎతోవా' మాటలను దూరంగా ప్రసారం చేస్తున్నట్లనిపించింది.

* * *

"తాతా, నీకు బిర్సా భగవాన్, సిద్ధు, కన్హుల గురించి తెలుసా?"

"వాళ్ల పేరులు తెలుసును కాని, వాళ్ల గురించి కథలు తెలియవు."

"తాతా, బిర్సా భగవాన్ ఏం గొప్పపని చేసాడు?"

"నాకు తెలియదు, బాబూ!"

"తాతా... నాకు స్కూలుకి వెళ్లాలని ఉంది."

"ఎల్లాగ, ఇన్నాళ్లు పోయాక నీకలా ఎందుకనిపించింది?"

"ఇప్పుడు నీ ఆరోగ్యం కొంచెం మెరుగయింది. మనపెరటి దొడ్డిలో మిరప మొక్కలు నాటి, వారం సంతలో మిరపకాయలు అమ్ముతాను. మన పాత మేకను అమ్మి ఒక కొత్త దాన్ని కొందాం. ఆ మేకకు పిల్లలు పుట్టాక మనకెంత డబ్బు వస్తుందో చూసుకో!"

"ఎతోవా! నాకెప్పుడూ నువ్వు బడికి వెళ్లాలనే ఉంటుంది. నువ్వే నీ అంతట మానేసావు. మిగతా మనవాళ్లు ఏం సలహా చెపుతారో చూద్దాం. అయినా, నేను మోతిబాబుకి మాటిచ్చేసాను, ఎలాగ?"

"ఏమీ కాళీ తెల్లకాగితం మీద నీ వేలిముద్ర వేయలేదు కదా?"

"లేదనుకో, కాని అతని దగ్గర పని చేస్తానని మాటిచ్చాను ఆదివాసి తన మాటెప్పుడూ అని తిరిగిపోడు."

"కాని నువ్వు వెళ్లకపోతే మరొకడికి నీ పని ఇచ్చేసేవాడు ఆ బాబు. ఏం, ఆ బాబులు వాళ్ల మాటలు నిలబెట్టుకోనక్కరలేదా?"

"నాకదేం తెలీదు. నాకు తెలిసినదంతా మనమాట మనం నిలబెట్టుకోవాలి. వాళ్ల పద్ధతులు వేరు, మన పద్ధతులు వేరు."



నవంబరు 15వ తేదీన బిర్సా జయంతి. అంతక్రితం రోజున మరునాడు పనిలోకి రానని మోతీబాబుతో చెప్పాడు ఎతోవా.

"ఏం?"

"రేపు బిర్సా జయంతి."

"అయితే ఏం? అది ప్రతి ఏటా వస్తుంది."

"ఈ ఏడాది ఎక్కువ మంది హాజరవుతారు. మేం క్లబ్బు అంతా ఘనంగా అలంకరించాలి."

"నాకు నవ్వు తెప్పించకు, ఎతోహ మీరోదో మొనగాళ్లం అయిపోయాం అనుకుంటున్నారు. రోజులు బాగులేవు కాబట్టి, మేం ఊరుకుంటున్నాం కాని, మీ వ్యవహారం మరీ శృతిమించుతోంది. బిర్సా జయంతా! చాలా పెద్ద సభ జరుగుతుందా! నోటమ్మట సరిగ్గా మాటాడలేని మీ అడవి మనుషులు ఏవో పెద్ద కబుర్లు చెప్పడం నేర్చుకున్నారే!"

ఎతోవాకి వళ్లు మండింది. కాని మోతీబాబు అంటే చాలాకాలం నుంచి పాతుకుపోయిన భయం మూలాన, ఏమీ జవాబు చెప్పలేదు. మాటాడకుండా ఇంటికి తిరిగి వచ్చాడు.

"తాతా, నోటమ్మట సరిగ్గా మాటాడలేని అడవిజాతివాళ్లమా మనం?"

"ఎవరన్నారు ఆ మాట?"

"మోతీబాబు. ఆయన ఎందుకు అలాంటి మాట అనాలి? మనకు చదువులేకపోవడం మూలాన, డబ్బులేదు కాబట్టి, నల్లగా ఉండడం వల్ల, మట్టి గుడిసెలలో ఉంటున్నందున - అలా అంటాడా?"

"ఆహా, నోటమ్మట సరిగ్గా మాటాడలేని ఆదిమకాలపు అడవి జాతి వాళ్లమా? ఈ అడవి మనుషులు లేకపోతే ఆయనకు రోజెల్లా గడుస్తుందో పాపం, ఎవరు అతని కోసం పని చేస్తారు?"

"నేనింక ఆయన పనిలోకి వెళ్లను."

"నీ ఇష్టం. సరే, రా. నది దగ్గరకు వెళ్లి మనం బట్టలు ఉతుకుదాం. రేపు సభకు చిరిగిన బట్టలు కట్టుకోక తప్పదు కాని, మాసిన బట్టలు కట్టుకోకూడదు. నీ జుట్టు చూడు; కాకి గూడులా ఉంది. ఏది ఇలారా, తలంటుతాను.

మరునాడు, ఆ పెద్ద సభ చూసి, అక్కడ మిన్నంటిన "బిర్సాముండా జిందాబాద్! సిద్ధు జిందాబాద్! కన్హు జిందాబాద్!" అన్న నినాదాలు విని, ఎతోవా పరమానంద భరితుడయ్యాడు. తమ జాతియంతా గర్వంతో ఒళ్లు పులకరించింది. తన ప్రియమిత్రులు రతన్, సింగ్‌రాయి కూడా అక్కడ ఉండడం వల్ల అతని సంతోషానికి హద్దు లేకపోయింది.

"మోతీబాబు మీకు సెలవిచ్చాడా ఇవేళ?" అని అడిగారు అక్కడి వాళ్లు.

"మాకు ఆయన్ని అడగవలసిన పని ఏమొచ్చింది! మాకు రావాలని అనిపించింది కాబట్టి మేమే స్వతంత్రంగా వచ్చేసాము."

"ఈ ఏడాది ఎంతమంది వచ్చారో ఈ సభకి?"

"మన టీచరుగారు ఈ సభకు అధ్యక్షుడని నీకు తెలుసా?"

ఈ సంవత్సరం మంగళ, భైరో, సుబల్, ఆలోమణి, భజన- వీళ్లందరూ కూడా వేదికనలంకరించారు. ప్రహరాజ్ మైక్ నిలబెట్టే ఏర్పాట్లు అన్నీ చేస్తున్నాడు. ఆ మైక్ సెట్టు బాటరీ మీద పని చేస్తోంది. ఇదివరకెప్పుడూ ఇంత పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగి ఉండలేదు.

"నిశ్శబ్దంగా ఉండండి! నిశ్శబ్దంగా ఉండండి" అని మైక్‌లో అరిచాడు ప్రహరాజ్.

"మన ప్రెసిడెంటు గంగారామ్ హేమ్‌బ్రామ్ ఇప్పుడు మాటాడుతారు". గంగారామ్ లేచి నిలబడ్డాడు. అతను చిన్నమనిసి అయినా, అతని మాట మామూలుగా మెత్తగా ఉన్నా, ఈరోజు అతను ఒక వస్తాదులాగా, ఒక గంభీరమైన వక్తలాగా అందరికీ తోచాడు.

"మనకు మన స్వర్గీయ వీరులైన సిద్ధు, కన్హుల ఫోటోలు లేవు, అందుమూలాన వాళ్ళ చిత్రాలు ఇక్కడ ప్రదర్శించలేదు. అయినా మనకు బిర్సా భగవాన్ బొమ్మ

ఉంది. దాన్ని నేను మీముందు పట్టుకుని ఉన్నాను. మీరందరూ ఒక్కసారి నిలబడి ఆయన చిత్రపటానికి జోహార్లు చెప్పండి. తర్వాత ఆయన జీవిత చరిత్ర మీకు చెప్తాను. అందువల్ల మీరందరూ ఉత్తేజం పొంది, మరింత ధైర్యసాహసాలు అలవర్చుకుంటారు. మీరు డబ్బుకి తక్కువ వాళ్లయినా, మీకు అన్ని అడ్డంకులు దాటగలిగే శక్తి సామర్థ్యాలు ఉన్నాయన్న ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది.

ఆహా, ఎంత దర్శనీయమైన చిత్రపటం అది! తెల్లని అట్టమీద నల్లని బొగ్గుతో దాన్ని చిత్రించి, దాన్ని ఒక వెదురు తడికకు అంటించారు. ఆ తలపాగా క్రింద ఎంత తేజస్సుతో, ఓజస్సుతో వెలుగుతోందో ఆయన ముఖం! అతని కళ్లు ప్రజ్వరిల్లుతున్న దివిటీలలా మెరుస్తున్నాయి. హఠాత్తుగా సభలో నిలబడి ఎతోవా ఎలుగెత్తి చాటాడు; "బిర్సాభగవాన్‌కి జై! బిర్సాభగవాన్‌కి జై! ఆయన మన కోసం ఒక మహాసంగ్రామం పోరాడాడు!" అది విని మిగతా అందరూ లేచి ఒకే గొంతుతో "బిర్సాభగవాన్‌కి జై! బిర్సా భగవాన్‌కి జై అంటూ అరిచారు.

ఎతోవా చిన్ని వక్షస్థలం తమ జాతియందు గర్వంతో పెద్ద ఎత్తుగా ముందుకు చొచ్చుకుంది. "నోట సరిగ్గా మాటరాని ఆదిమకాలపు అడవి మనుష్యులా!" ఇంకా వాళ్ల జీవితాలు దూళ్ల కాపరులుగా, పొలం కూలీలగా మాత్రమే గడపవలసిన పనిలేదు. ఎతోవా చదువుకుని, తనని కలవర పరుస్తున్న ప్రశ్నలకు సమాధానాలు కనుక్కుంటాడా. వాళ్లు మట్టిగుడిసెలలోనే ఎందుకు నివసించాలి? తనతాత ఎప్పుడూ చిరిగిన పంచే కట్టుకుని ఉండాలా? వీటికి పరిష్కారం సాధించాలి.... డులాంగు, సువర్ణరేఖ నదులు తన రక్తంలో ప్రవహిస్తున్నాయా అన్నట్లుగా అతని గుండె ఉప్పొంగింది.

*　　　*　　　*

ఇంతటితో దూళ్ల కాపరిగా ఎతోవా జీవితం ముగిసింది. వివిధమైన ఆదివాసుల నాయకులు తమ పిల్లలను బడికి పంపేందుకు కావలిసిన ఏర్పాట్లు కనుక్కునేందుకు తమ నిర్ణయాన్ని కూడబలుక్కున్నారు. తమతమ ప్రాంతాలన్నింటిలోనూ పాఠశాలలు నెలకొల్పేలా ప్రభుత్వాన్ని ఒత్తిడి చేసారు. మరి కొంతకాలం తర్వాత తమ బడులలో తమ జాతికి చెందిన ఉపాధ్యాయుణ్నే నియమించేలాగ సర్కారు వారితో పోరాడి నెగ్గారు. కాని ఆదివాసుల పిల్లలు బడికి వెళ్లకపోతే ఈ ప్రయత్నాలన్నీ వృథా అయిపోతాయి...

మోతీబాబుకి హద్దులేని కోపం వచ్చింది. " ఏమిటి, దూళ్లకాపర్లు ఎవ్వరూ కూడా పనిలోకి రారా? వీళ్ల సంగతి నేను చూస్తాను!"

అతని అన్నగారు అతనికి నచ్చజెప్పాడు; "నువ్వేం చేయగలవు? మనవి ఆరుకుటుంబాలు- వాళ్లవి వందలకొలది ఉన్నాయి. వాళ్లతో మంచిగా మాటాడి రాజీపడు. వాళ్లమీద కేకలు బొబ్బలు వేసి అరిచే రోజులు వెళ్లిపోయాయి."

కొంచెం బుద్ధి తెచ్చుకుని మంగళ్ దగ్గరకు వెళ్లాడు మోతీబాబు.

"ఏం జరిగింది, మంగళ్?"

"ఏంటి అంటున్నారు, బాబు, ఏంజరిగిందంటారు?"

"ఏతోవా పనిలోకి రావడం మానేసాడు. ఆ మాట నీకు తెలీదా!"

"ఇంక వాడు కూలి పని చేయడు, బాబు! వాడు బడికి వెళ్లాలి. ప్రభుత్వంవారు స్టైఫెండు, పుస్తకాలు, టిఫిను అలాంటివి అన్ని ఇస్తారు వాడికి. వాడికి ఇవన్నీ దొరుకుతున్నప్పుడు, ఒకళ్ల దగ్గర బానిస పని ఎందుకు చేయాలి?"

"ఈ చదువు, వ్రాత - ఇవన్నీ ఎందుకు ఉపయోగిస్తాయి? వాడేమైనా మహారాజు



కాని, మహామంత్రి కాని అవుతాడా?"

"లేదు, బాబూ! వాడు ఒక మానవుడు అవుతాడు. తనూ ఒక స్వేచ్ఛాజీవిని, మానవుణ్ని అని నిరూపించుకుంటాడు."

"ఇదంతా ఏదో కుట్రలా ఉంది. అందుచేత జాగ్రత్తగా నామాట విను, మంగళ్! ఆకుమడి, కోతలు అల్లాంటి రోజుల్లో మిమ్మల్ని ఎవరినీ నాపనిలోకి పిలవను!"

తల నెమ్మదిగా గోరుక్కుంటూ మంగళ్ సమాధానం చెప్పాడు; "అదేం అంత తెలివైన పనా, బాబూ! మేమల్లా జరగనియ్యం. గాలి ఇటుపక్క తిరిగింది. రోజులు మారాయి. "అడవి మనుష్యులు" ఐకమత్యం సాధించారు."

తన కోపం తనలోనే మ్రింగుకుని, నోరుమూసుకుని ఇంటికి తిరిగివెళ్లాడు మోతీబాబు.

* * *

ఈరోజు ఎతోవా తెచ్చి ఇచ్చిన ముల్లంగి దుంపను స్వీకరించాడు బడిపంతులు. ఎందుకు తీసుకోకూడదు? తన విద్యార్థినుండి ఆ మాత్రం బహుమతి పుచ్చుకోవచ్చుకదా ఉపాధ్యాయుడు.

బడి విడిచిపెట్టాక, ఎతోవా నది ఒడ్డున ఉన్న ఇసుక తిప్పల వద్దకు పరుగెత్తాడు. తన వీపు మీద వెల్లకితలా పడుకొని, ఆకాశాన్ని ఉద్దేశించి ఇలా పలికాడు. "అది ఎంత ఘోరమైన పోరాటమో నీకు తెలుసా?'

నది, ఆకాశం, గడ్డి, పొలం, చుట్టూ ఉన్న ప్రకృతి అంతా అతని ఆనందాన్ని పంచుకుంటూ, ప్రతిధ్వనిస్తూ, ఆ సూర్యకాంతిలో అతనితోపాటు హర్షించాయి, హసించాయి.

వెర్రి కుర్రాడు! తను ఒక గొప్ప పోరాటంలో నెగ్గానని, తన ఘోర సమరం ముగిసిందని అతనికి తెలిసినట్లులేదు...

ఈ విధంగా ఎతోవా యొక్క సమర విజయ గాథ సుసంపన్నమయింది.

Lasertypeset by Speed Print, Vijayawada (A.P.)
and printed at Tara Art Press, Sector-5, Noida (U.P.)

